శ్రీ

# సత్యనారాయణ వ్రత మాహాత్మ్యము.




చందవోలు గ్రామ వాస్తవ్యులైన

బ్ర॥ శ్రీ॥ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారిచే

విరచితము.



ప్రథమ ముద్రణము 2000 ప్రతులు



మహోపాధ్యాయ

బ్ర॥ శ్రీ॥ ముదిగొండ నాగలింగశాస్త్రిగారిచే

పరిష్కృతము.





రామకృష్ణా ప్రింటింగు వర్క్సు, తెనాలి.

*1929*

శ్రీ

శివాభ్యాంనమః.

# భూమిక.

సుజనులారా!

శ్రీ సత్యనారాయణ వ్రతము ప్రత్యక్ష ఫలప్రదమగుట సర్వజన విదితము. ఈమహావ్రతంబు దీనిమహిమంబును శ్రీస్కాందపురాణ ప్రసిద్ధమైయున్నది. అయిన నది సంస్కృత వాఙ్మయమున నుండుటను, నందగు కథాభాగము వచనరూపముగా నున్నను నయ్యది రసవంతము గామింజేసి యిద్దాని మాహాత్మ్యమును తెలుఁగున కావ్యశైలిని రచించినచో రసికజనసమ్మతముగా నుండునని కొందఱు మిత్రులు ప్రోత్సహించుటను శ్రీ సత్యనారాయణ మహిమాభివర్ణనంబిహాపర సుఖదాయకంబగుటను యథామతి నీకృతి నొనరించిరి.

శ్రీకనుమూరి శీతయ్యగారు దీనిని ముద్రింపించి సర్వజన వేద్యము గావించి శ్రీసత్యదేవు ననుగ్రహమునకుఁ బాత్రులైరి. మీరలెల్లరు దీనిని బఠించి శ్రీ సత్యనారాయణస్వామి కృప ననవధిక సుఖంబుల నొందుదురుగాక యని గోరుచున్నాఁడను.

ఇట్లు,

తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి.

# తప్పొప్పుల పట్టి.

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 8 | బునర్ | బురర్ |
| 6 | 19 | యించి | యించె |
| 21 | 10 | తలోక | తిలోల |
| 22 | 11 | లాస | ల్లాస |
| 23 | 15 | ద్విజునిర్ | దివిజుర్ |
| 28 | 17 | చ్చెనఁప్ర | చ్చెనఁబ్ర |
| 33 | 6 | మింతు | మింతి |
| 36 | 20 | చేతి | చేత |
| 36 | 23 | దమ | దను |
| 37 | 9 | వనగ | వులన |
| 39 | 2 | బులవె | బుఁబలె |
| 56 | 13 | బువ్వు | బువ్వ |
| 56 | 14 | వ్యాల | ల్వాల |
| 57 | 4 | వెర | లెర |
| 64 | 21 | బీట | చీట |
| 67 | 18 | వేరు | లేదు |
| 69 | 24 | దనవేం | నువేదం |
| 71 | 5 | న్నరుణాదీప్తి | నలినవతుల |
| 78 | 12 | దినిచి | దిగిచి |
| 80 | 3 | బాసిచన్య | బాసిచనెం |
| 80 | 6 | పించు | పించె |



శ్రీ శివాభ్యాంనమః

శ్రీ సత్యనారాయణస్వామినేనమః.

# సత్యనారాయణవ్రతమాహాత్మ్యము.



ఉ॥ శ్రీయొసకంబెసంగు సర ♦ సీజము నాఁదగుపేరు ర మ్మన
మ్నాయనమించు తత్స్మృతమ ♦ యూఖముల న్విలసిల్లు
మోము చం । ద్రాయిత సంస్తవంబున న ♦ యామృతము
ల్వాదఁజల్ల సత్యనా । రాయణ దేవుఁడెప్పుడుఁ బ ♦ రస్స
రుఁడై మము నోముఁ గావుత౯॥

సీ॥ ప్రాబల్యుఁ దొయ్యాలి ♦ పాపటఁ జెందిరం
బలరించు నెవ్వని ♦ యడుగుఁ దమ్మి
ముల్లోకములవారి ♦ మురిపెంపుఁ బాటల
నాటాడు నెవ్వని ♦ యసము నెలత
పుట్టఁ బుట్టువుపల్కు ♦ పూఁబోడి సొమ్ముల
కొఱఁదీర్చు నెవ్వని ♦ గొనములచ్చి
తనుఁగొల్చువారి వం ♦ తలఁగూర్చు లేముల
గెంటు నెవ్వని కడఁ ♦ గంటిచూడ్కి

తే॥ వాని ముక్కంటి వింటిచే • వలకుఁ ద్రుప్పఁ
బుడమి కన్నియ యెడఁ దమ్మిఁ ♦ బొలుచుఁ దేటిఁ
దలతు శ్రీరామదేవుఁ జి ♦ త్తంబునందు
మందరస సత్కవిత్వ సం ♦ పత్తిఁ గోరి॥

క॥ అని దేవగురు కవిద్విజ
జనమును మనమున నుతించి ♦ ఛాయాకవులం
గనివిడిచి యొక్కపొత్తం
బును విరచింపంగఁ గుతుక ♦ మున నున్నంతన్॥

ఉ॥ శ్రీరమణీయమై పెనుపుఁ ♦ జెందిన రాజకులంబునందు మం
దారముదారి నాశ్రితులఁ ♦ దన్పుచుఁ గీర్తుల తానుషక్తమై
భూరిగుణాలయంబు కను ♦ మూరుకులంబు కరంబెసంగు న
ప్పేరెటులబ్బెనో? కలదు ♦ పేర్చిన మూడవకన్ను వారికిన్॥

క॥ ఆవంశంబున సొరిది న
నావిలమతి యుదయమందె • నల వెంకటరా
జావిష్ట విష్ణుభక్తికుఁ
డావిభునకు సరసమాంబ ♦ యాలై వెలసెన్॥

ఉ॥ ఆనరనాథమౌళి సతి ♦ యా నరసాంబిక యందుఁ గాంచె భూ
ధేనుసువర్ణదానజిత • దివ్యవనాంతరభూజు సర్వవి
ద్యానవ భోజు భూజన ని ♦ రంతరసంస్తుత వర్ణనీయ తే
జోనిధి తేజు నన్వయవి • శోధను నాత్మజు జోగిరాజునన్॥

ఆ॥ వె॥ ధర్మపత్నియయ్యె ♦ ధరణీధ్రధైర్యుఁడౌ
జోగిరాజమణికి • సురుచిరాంగి

దేవవిప్రబంధు • సేవాపరాత్మక
భద్రశీలయైన • భద్రమాంబ॥

శా॥ ఆభద్రాంబిక సంతతార్చిత నిజే • శానుగ్రహంబొప్ప నా
గోభీతాత్ములఁ బుత్రులంగనెనొగి • న్గోపాల రాజేంద్రునిన్
శ్రీభవ్యుండగు వేంకటావనివిభు • న్శ్రీరామ సౌమిత్రియు
క్శోభా సంవిజితాశ్వనేయమగు త • త్సుభ్రాత్రు భావం
బునన్॥

తే॥ ఘనుఁడు వెంకటరాణ్మణి • కన్నసుతుల
రామరాజును మఱి సుబ్బ • రాజుఁ బెండ్లి
యాడి యొగి నచ్చమాంబ స • త్యాంబ పెద్ద
రామరాజును జిన రామ • రాజుఁగనిరి॥

కం॥ గోపాలరాజ మణియుం
జేపట్టె న్నరసమాంబ • శ్రితజగదంబన్
సూపహితగుణకదంబ
న్భూపాల కులావలంబ • భూరినితంబన్॥

సీ॥ పురుషోత్తమత్వ వి • స్ఫూర్తిమూర్తి యపోని
రమ్యు లక్ష్మీపతి • రాజవర్యు
నతిలోక వైభవో • న్నత వినతాత్మ నా
శ్రయణీయు వేంకట • రాజముఖ్యు
నకలంక సుప్రసా • దాస్పద వదన వి
భ్రాజమానుని చంద్ర • రాజచంద్రు
భోగినీవర్ణిత • భోగావళీగత
ప్రాభవాంచితు జోగి • రాజహంసు

ఆ॥ వె॥ సుగుణ ఖనులఁ గనియె ♦ సూనుల గోపాల-
నరవరేణ్యుఁడల్ల ♦ నరసమాంబ
యందు నందునిందు ♦ నవ్యయసుఖముల
నందఁగోరి వారి ♦ యందునోలి॥

కం॥ ఆపన్నజన దయాళుఁడు
భూపాల కులప్రదీప ♦ భూతుండా ల
క్ష్మీపతి రాణ్మణివంశం
బేపారెడు ముత్తియముల ♦ కిక్కగ వోలిచెన్॥

తే॥ గీ॥ వరుస వేంకటరాజుగో ♦ పాలరాజు
సుబ్బరాజనన్నిద్దఱ ♦ సుతులఁగనియె
గోపులంబోలువారికిఁ ♦ గొడుకులైరి
ప్రకటవినయులు వెంకట ♦ రాజముఖులు॥

ఆ॥ వె॥ వెంకమాంబయందు ♦ వెంకటరాజునుఁ
గనియెచంద్రరాజు ♦ ఘనయశుండు
భారతప్రశస్త ♦ వసుధేశనీతిస
ద్గుణములెల్లవాని ♦ తోడఁబుట్టె॥

కం॥ గురుశుక్ర నీతివిద్యలఁ
బరిణతుఁ డధిజనవిధేయ ♦ భావుఁడతఁడు ధీ
వరులగుఁగొడుకుల సుగుణో
త్తరులంగనెనన్వవాయ ♦ తంతువుసాగన్॥

కం॥ సారమతిజోగిరాజతి
భూరిగుణాస్పదుఁడు ధర్మ♦ మున్వోలయించెం

దారమతి వైభవమ్మును
దారమతయుఁ దోడుగాఁ గృ ♦ తస్వార్థుండై॥

కం॥ గోపాలుజోగిరాజధ
రాపాలునిసతికి నేనయె ♦ బ్రహ్మణేంద్రా
ణీ పద్మలు జ్ఞానంపుం
బ్రాపునఁ బ్రాభవమునందు ♦ వైభవమందున్॥

సీ॥ భద్రమాంబాప్రాణ ♦ పతికీర్తనీయుండు
బుధనుతవినయుండు ♦ బుచ్చిరాజు
సత్యమాంబాదారుఁ ♦ డత్యుదారస్వాంతు
డల్లవెంకటరాజ ♦ నన్యతుల్యుఁ
డచ్చమాంబానాథుఁ ♦ డాశ్రితపాలనా
శ్రద్ధధానుండైన ♦ రామరాజు
సుందరాంబాచిత్త ♦ చోరుండుధీరుండు
రంగరాజుధరామ ♦ రప్రియుండు

తే॥ గీ॥ మహితులేసాధ్వికిని మేన ♦ మామలల్ల
సూరివెంకటపతిరాజు ♦ సుబ్బమాంబ
యేమహిళకు మాతామహు ♦ లీడ్యచరిత
యాగరితజోగిరాజుని ♦ ల్లాలు వెలయు॥

సీ॥ పద్మరాజునకును ♦ బ్బమదేవి కేతన్వి
నప్తి ప్రియైమేలిజ ♦ న్మమ్ముదాల్చె
నట్లయేసుచరిత్ర ♦ యచ్చమాంబకుఁదిరు
పతరాజమాళికిఁ ♦ బాత్రియయ్యె

బాపిరాజునకుఁద ♦ త్ప్రియా నరసాంబి
కకుఁబుత్రియయ్యనే. ♦ ఘనచరిత్ర
రహినచ్చమాంబికా ♦ రామలక్ష్మిప్రపతి
యగుపెద్దిరాజున ♦ కనుజయ్యెవతె

తే॥ గీ॥ యల్లవెంకటరాజుమే ♦ నల్లుఁడే సు
సాధ్వికీమహానుభావనా ♦ సరసిజాక్షి
మంతెనాన్వయపావని ♦ నింతిఁబరిణ
యంబయిగడించె జోగిరా ♦ జమితయశము॥

కం॥ ధర్మాలంబన భూతవి
నిర్మలమహితాభిజాత ♦ నిస్సారితదు
ష్కర్మపరిపూతసీత వి
నిర్మించెనుజోగిరాజు ♦ నియతినియతయై॥

ఆ॥ వె॥ అక్కుటుంబినిగనె ♦ ననఘువెంకటరాజుఁ
దనదుగర్భశుక్తి ♦ తగఫలింపఁ
గోరితెమ్మకొనిమ్మోఁ ♦ గోడలిరుచిరాంగిఁ
బిచ్చమాంబయనఁగ ♦ సచ్చరిత్ర॥

కం॥ పతాదృశాభిజాత్య
స్ఫీతయశోద్యోతసీత ♦ వెలయించిననే
కాతతసుకృతారంభము
లాతరణిశశాంకసుస్థి ♦ రాయతిగలుగన్॥

సీ॥ నిక్షేపములఁజేసె ♦ నిజధనంబులకెల్ల
ననవద్యచరితుల ♦ నవనిసురుల

బావుల చెరువులఁ ♦ బన్నించెఁద్రవ్వించె
జంతుసంతృప్తికా ♦ శ్వతముగాఁగ
సేవించెఁ గాశివి ♦ శ్వేశుఁడాదిగఁగల్గు
క్షేత్ర తన్మూర్తివి ♦ శేషములను
వినెఁబురాణేతిహా ♦ సనవప్రబంధముల్
సబహుమానముగనా ♦ సక్తిమిగుల

తే॥ నర్థిగోభూహిరణ్యాము ♦ ఖ్యంబులైన
దానముల్పదియాఱు ని ♦ త్యముగనొసఁగె
శ్రీగురుసమాశ్రయణమున ♦ సీతమాంబ
చెవికిఁ జవిఁజూపెఁ దిరుమంత్ర ♦ సిద్ధరసము॥

కం॥ ఏసవనమెవఁడు సేసిన
నాసీతాంబికసహాయు ♦ మై ధనమొసఁగుఁగాఁ
జేసె మఱిఁబెక్కుమార్లు సు
ధీసమితికి బహుసరస్వ ♦ తీదానంబుల్॥

ఉ॥ పంబిన భక్తియోగమున ♦ భావినిసీతమ పిట్లవాని పా
లెంబను స్వీయమామఁబురిఁ జ ♦ లింపనికీర్తియపోని దేవళం
బుంబనిఁ బూన్చియచ్చట వి♦భూతికి సీమగనాంజనేయ దే
వుం బవమానసూను నధి♦పున్నిలిపెందన వంశముబ్బఁగన్॥

కం॥ ఎత్తించె ధ్వజస్తంభము
నిత్తఁడిఁ బైఁదొడుపుఁజేసె ♦ నిటుస్వీయంబౌ
పుత్తడి తోధర్మంబుల
నుత్తమము లనేకములుగ ♦ నొదవించెఁబళ్లే॥

ఉ॥ ఈవిధి ధర్మకర్త్రియగు ♦ నింగితవేదిని సీతమాంబయా
బావకొమారులున్నకల • బంధువులుం దనచుట్టనుండభూ
దేవులతోఁ బ్లవంగవిభు ♦ దేవళమందు సదస్సుఁదీర్చి స
ద్భావముతోననుంబిలువఁ♦బంచిసమర్హసమాదరంబునన్॥

కం॥ మీయయ్య మీరుఁజెప్పిన
నోయయ్య పురాణగాథ ♦ లున్నతి వినినే
జేయఁగల పనులఁ జేసితిఁ
బోయన్నియుఁ జేయనన్నుఁ ♦ బోటికిఁ దరమే?॥

చం॥ ముదిరిన బ్రహ్మచారిమన♦ముంగిటివేల్పగు నాంజనేయు సం
పదనొకయింటివాఁడగు శు♦భమ్మునకిమ్ముగఁ జేయ నెంచితిన్
హృదయము మెచ్చి మంచియిది♦వృత్తమెసంగెడుగావ్యకన్యస
మ్మదముననీయ వేయనిన♦మస్కృతితోఁదమలమ్మొసంగినన్

మ॥ అతిసంతోషముతోడ నేనునుఁ దదీ♦యంబైన మేలంది మ
త్కృతినాథుండు చిరార్థితుండు సమగూ♦రెన్సత్యనారాయణ
వ్రతమాహాత్మ్యముఁగూర్తునీనికనుచు♦న్భావంబునన్భావియ
ద్భుతమౌతత్కథ సుప్రసిద్ధమగుటం♦దోడెంబవర్ణించెదన్॥

సీ॥ అలకేసరిక్షేత్ర • మైన యంజనయందు
రుద్రవీర్యమున మా ♦ రుతువరమునఁ
బొడమియింద్రునివజ్ర ♦ మునకు నోడని గరి
మంబునఁ దా హను • మంతుఁడనఁగఁ
బేరంది యందఱు ♦ వేల్పులు వరమిచ్చి
నేయస్త్రశస్త్రంబు • లేనిదన్న

నోంపని కడిమి చె ♦ న్నువహించి తొమ్మిది
వ్యాకరణంబులు • నాదిఁగాఁగ

తే॥ నఖిల విద్యలు నినునితో ♦ నభ్యసించి
తత్సుతుండగు సుగ్రీవుఁ ♦ దవిలి మంత్రి
పదవి నెగడుచు శ్రీరాము ♦ బంటననుచు
మించి లంక దహించిన • మేటియసదె?

సీ॥ శతయోజనంబైన ♦ సాగరంబవలీల
లంఘించె విఘ్నము ♦ ల్వాలను సెడఁగ
నలువదినూరులా • నామడలారసి
వేగకమున్నతా • వెదకె సీత
రేగి శాత్రవుని పం • డ్రెండామడ యశోక
వనమొక్క గడెలోన • మొనసి వెదికె
లెక్కకు మిగిలి వా • లిన పగవారల
సైన్యము ల్నుగ్గు నూ ♦ చముగ నణిచె

తే॥ పట్టువడినట్టుల నటించి ♦ ప్రభువుఁగాంచి
నీతులవచించి తలఁద్రొక్కి • నింగిముట్టెఁ
జూచిరమ్మన్న గాల్చి వ ♦ చ్చుఘనుఁడన్న
పేరుఁజెందిన మాకృతి ♦ వరుఁడ వరుఁడు॥

సీ॥ ఒకపిడికిలిపోటు ♦ నకు రావణుండేని
జముఁజూచివచ్చెడు ♦ జాడ నెఱపె
నుక్కుతునుకలువోని • పెక్కండ్రు దైత్యుల
నొక్కొక్కతాఁకున ♦ నుదిలపఱిచె

ననిమూర్ఛనొందిన • తనవారిఁ గావ సం
జీవనిగిరితోఁడఁ ♦ జేరఁదెచ్చె
సాకేతపురమందు ♦ సామ్రాజ్య పట్టాభి
షిక్తుఁడౌ శ్రీరాము ♦ భక్తిఁగొలిచె

ఆ॥ వె॥ ఘోరశౌర్యధైర్య ♦ వీరభావప్రమా
వినయకీర్తిముఖ్య ♦ వివిధసుగుణ
నిచయుతోషితావ ♦ నీనాకపాతాళుఁ
డాంజనేయదేవుఁ ♦ డసదువాఁడె?॥

శా॥ భక్తిన్రాముని దేవుఁగా గురునిగా ♦ భ్రాజిష్ణుగానెంచి సీ
తోక్తప్రక్రియ నాత్మతత్వమఖిల♦మ్మూహించి మేలెంచి యు
వ్యక్తాతీత తగంధమాదనమునం ♦ దాసీనుఁడై సత్పదా
సక్తిన్మేల్తపమాచరించెడుభవి♦ష్యద్బ్రహ్మసామాన్యుఁడే?॥

శా॥ స్ఫీతత్వాసుర మంత్రతంత్ర వశుఁడై ♦విజ్ఞాభియోగోల్ల స
ద్ఖ్యాతిం బిట్టలవాని పాలెమున ను♦ద్బద్ధత్వముంబొంది త
త్సీతాంబాపనితాలయస్థిరతర ♦ శ్రీసంశ్రయీభూతుఁడౌ
ఖ్యాతుంగేసరి పుత్రునున్ముఖు నభి♦ధ్యానింతుఁగృత్యర్థమై.

---

## ష ష్ఠ్యం త ము లు.



కం॥ ఏతాదృశగుణ గరిమో
పేతునకున్ రాజపుర ని ♦ విష్టాత్మునకున్
సీతాంబా స్థాపితునకు
భీతాసుర లోకునకు న ♦ భిధ్యాతునకున్॥

కం॥ భక్తజనపాలనా సం
సక్తమనోజ్ఞాతునకు న ♦ సంశయసమభి
వ్యక్తాఖిల విద్యునకుం
బ్రాక్తన సుకృతాభినంద్య ♦ పదపద్మునకున్॥

కం॥ శ్రీరామ దూతునకు సు
స్మేరవదన కమలునకు న ♦ మేయబలునకున్
భూరామా భారాపహ
ఘోరర్గళ జృంభితునకు ♦ దుర్జయ మతికిన్॥

కం॥ దేవా? నీకర్పితముగ
నావర్ణితమైనసత్య ♦ నారాయణుం డ
న్దేవుని వ్రతవిభవంబుం
భావంబున నవధరింపు ♦ మా? యెట్లనినన్॥

---

# క థా రం భ ము.



కం॥ రత్నకలా పాంచితమై
రత్నాకర మీఁడనంజి ♦ రత్నవిభూతిన్
నూత్నమగు పుడమితోడవగు।
రత్న పురమ్మలరు సర్వ ♦ రమణీయంబై॥

ఉ॥ ఆపురిలోన నుండెడు మ ♦ హాజన వర్యుఁడొకండు వర్తకం
బేపనిఁబూని యుజ్జ్వల ద ♦ హీనమణీధన సన్నిధానమై
శ్రీప్రదమైన పూరుషుని ♦ సిద్ధియయాలను శాస్త్రపద్ధతి
వ్యాపృతికి న్నిదానమగు ♦ భావిని భావముతోఁ జరింపగన్॥

కం॥ శ్రీ వర్ధన నామకుఁ డతఁ
డావిష్కృత సుగుణరత్న ♦ హారిచరిత లీ
లావతి నుపలాలించుచు
నీవిధి నుడువం దొడంగె ♦ నేకాంతమునన్॥

శా॥ ఓలీలావతి? మత్సమానుఁడగు వై ♦ శ్యుంగానవెందేని ల
క్ష్మీలాభంబుననైనఁ దృప్తిపనునే♦కృత్యహాణముద్యోగమీ
వేలన్నాగరభూమిభాగముల శ్రీ ♦ విస్ఫూర్తితో నూత్న ర
త్నాలంకారములమ్మఁబోవలయునీ, యాంతర్య మెట్లున్నదో॥

కం॥ ఆదేశమ్ముల వార్తలు।
నీదృశములుకాన నిప్పు ♦ డిటు పోవలసెం
గాదనక యనుమతింపు।
గాఁదగు నింకెదియు నుడువఁ ♦ గాఁ గాదనుడున్॥

తే॥ గీ॥ అతివ యప్పని తప్పని ♦ దనుట నతని
చిత్త గతిమాన్పఁగాఁదగు ♦ జేవలేక
విరహమునకాత్మఁ దలరియు ♦ విభునిజూచి
శుభ మనుచుఁ జెమ్మ గ్రమ్మెడు ♦ చూపుమలిపె ॥

శ్రీవర్ధనుడు వాణిజ్యయాత్ర కరుగుట.

తే॥ గీ॥ అదియ యనుమతిగాఁగొని ♦ యర్యవరుఁడు
జాగ రూకవై యుండుము ♦ చానయను చు
తగిన ధనములు నింపిన ♦ తరణితోఁడ
సాగరంబున జనెఁబరి ♦ జనులుగొలువ॥

ఉ॥ పోయి యనేక దేశముల ♦ పోడిమినెమ్మదినాదరింపుచా
యాయెడ రత్నముల్విలువ ♦ నార్జనహెచ్చుటకిచ్చమెచ్చు
చుం। బాయని కూర్మిఁగౌశికియ ♦ భంగ తరాంగ తరంగ
సంగతి। న్నాయకు నాదరించు నెడ ♦ నోతతినాగుచుమంత్రి
కిట్లనుర్॥

శా॥ ఆ గోదావరి తీర దేశము మహీ ♦ యః ప్రాభవోద్యానభూ
భాగామోదితమంద మారుతరుత ♦ వ్యామృష్టనిర్మృష్టసం
భోగాయాస సమాసభాసురస్ఫుర ♦ స్ఫూర్తిద్యనారీనరం
బాగోదూరముఁజూచితే? సచివవ ♦ర్యా? స్వర్గమిట్లుండునే॥

మ॥ మఱియుంజూచితె? యల్లతీరమునసా ♦ మ్రాజ్యంబుతో
నొక్కటేఁ। డొలుపొప్పర్ణ కుటీర మధ్యమున వి ♦ ద్యుద్గాత్రి
యాపత్నితో। నఱలేకుండ మహావ్రతంబెదియొ చే ♦ యం
బూనినట్లుండెని। త్తఱిఁ దత్సన్నిధికేగి తద్విధముఁజ ♦ త్తం
బారసీక్షించెదర్ ॥

కం॥ అనిసోత్సుకమతిసహాపరి
జనుఁడై సజ్జనుఁ డు మొనసి ♦ చనుచు నెడ వయో
ఘనుఁడగు కంచుకినడుగుట
యును వీనిక నిట్టులనియె ♦ నొగినాతండుౘ॥

సీ॥ కలనైనఁ బరకాంత • కథసహింపనివాఁడు
ననుకూలుఁడై పత్ని ♦ నరయువాఁడు
తగుబందుగులనైన • నగియుఁబొంకనివాఁడు
పరహితసత్యంబుఁ • బలుకువాఁడు
శత్రులనేనింద • సలుపనెంచనివాఁడు
చెన్నటి మిత్రుఁ శా ♦ సించువాఁడు
వాదునకే నస ♦ త్పతుమూననివాఁడు
విశ్వేశుభక్తిసే ♦ వించువాఁడు

తే॥ గీ॥ నాస్తినేరనివాఁడుఁ బ్ర • శస్తిఁ గన్న
వాఁడు వాడనికీర్తి పు ♦ ష్పమ్ము్రవాఁడు
వీరుఁ డుల్కాముఖుండను ♦ పేరివాఁడు
లీలధర్మ పురీవరం ♦ బేలువాఁడు॥

ఆ॥ వె॥ భద్రముఖి వినిద్ర ♦ పద్మపత్రాక్షిను
వ్రత గొనాలదొంతి ♦ వారణేంద్ర
యాన నీపవోలె ♦ ననుసరించి చరించు
భద్రశీల వానిఁ ♦ బడతిమిన్న ॥

ధర్మపురీశుడు సత్యనారాయణ వ్రతము నాచరించుట.

తే॥ జాయతోఁగూడి మాఘపేడు • సత్యదేవుఁ
బూజ సేయంగ సమకట్టి ♦ పున్నెమైన

క్రౌశికీతీరమునఁ దన ♦ కలిమి వెలయ
విడిసియున్నాఁడు వలతేని ♦ వేఁగఁబొమ్ము ॥

చ॥ అనవినిసంతసమ్మున మ ♦ హాజనుఁడేగివిధిప్రయుక్తిఁ గాం।
చిన విభుఁడాదరించెఁదగు ♦ చేతలనుండెనతండు నట్టిచో ।
జననుతుఁడౌ పురోధయను ♦ శాసనమొప్పఁగ । విఘ్ననా
థుపూ । జనమటవమున్నగాఁజరిగె ♦ సర్వవిధానము విధ్య
ధీనమై ॥

క॥ ఇంద్రాది దిగీశులతోఁ
జంద్రాదినవగ్రహముల ♦ సంభావనని
స్తంద్రుఁడయిసలిపి పయిభూ
మీంద్రుఁడు సద్భక్తియుక్తి హృష్టాత్ముండై ॥

తే॥ సత్యదేవు రమాసతీ ♦ సహితు నెడద
ధ్యాన మొనరఁగ నావాహ ♦ నాదికములఁ
బ్రతిమ నర్చించి ధూప దీ ♦ పము లమర్చి
యవసరప్రాప్తనైవేద్య ♦ మాహరించె ॥

క॥ సింగప్పుఁదలకల ముఱుఁగుల
కుంగలయూఁజాలుమకర ♦ కుండలములపై
హంగగుబంగరుసేల్వ సొ
బంగెల యింపంగనొక్క ♦ పండితుఁడచటన్ ॥

ఆ॥ వె॥ ఉన్నతాసనమున ♦ నుండిపొత్తమువిప్పి
శ్రుతికి తగిన రాగ ♦ గతి నమర్చి
గళముసంబళించి ♦ క్రమపురాణమ్మును
జెప్పఁదొడఁగె స్మితము ♦ చెంగలింప ॥

తే॥ గీ॥ నాల్గు మొగములు లేనట్టి ♦ నలువయొండు
కేలఁ గవనొప్పు రెండవ ♦ కేశవుఁడు
ఫాలమున లోచనము లేని ♦ భవుఁడు బాద
రాయణుఁడు వందనీయుఁడీ ♦ ప్రజకు నెల్ల ॥

తే॥ జ్వలనసముఁడైన రోమహ ♦ ర్షణ తనూజు
సత్రయాగంబునం బూజ ♦ సలిపి యడుగ
శౌనకాదుల కమ్ముని ♦ సత్తముండు
నాదరంబున నిట్లను ♦ ననఘులార? ॥

నారదమునీంద్రుఁడు మహావిష్ణువును స్తుతించుట.

కం॥ నారదుఁ డొకపరి భూసం
చార మ్మొనరించి ప్రజల ♦ చారిత్రలకున్
దూరవగచి వైకుంఠముఁ
జేరి యిటు నుతించె నాహృ ♦ షీకేశ్వరునిన్ ॥

సీ॥ ఉద్ధరించితికదా? ♦ యుదధిలోఁ బడి చిక్కు
నవని వరాహంబ ♦ వై కడంగి
యర్పించితివి కదా? ♦ యసురరూ పడఁగించి
యజునకు శ్రుతుల మ ♦ త్స్యంబవగుచు
నాహరించితికదా? ♦ యఘములఁ దొలఁగింప
నంఘ్రినీరజమున ♦ నమలఝరము
పోషించితివి కదా? పుణ్యవంతుల నెల్ల
భువనమోహనరూప ములధరించి

తే॥ నేలభారమ్ము మముఁబోంట్ల ♦ నేలుభార
మాదిఁ బూనితి విపుడు పా ♦ మ్మన్నఁబోదు

కాదె? విదితాత్మనిధ్యాన ♦ కలితవిశ్వ
రూప? నీరూప? రూపవ ♦ ద్రూపరూప? ॥

కం॥ అని మునికొనియాడిన నవె
జనార్దనుండా దరమున ♦ సంయమినాథా?
పనియేమి కలిగి వచ్చితొ?
మనమున నేమున్నదో? స ♦ మస్తముఁ జెపుమా॥

కం॥ ఆ ముని యిట్లను దేవా?
నీమది కెఱుఁగంగరాని ♦ నియతియుఁగలదే?
భూమి భువనమునఁబాపం
బేమి వచింపంగఁగలద ♦ హీనశయానా॥

సీ॥ బ్రహ్మవిద్వేషులు ♦ పరపీడనులు లోభ
వశులు గామక్రోధ ♦ పరహ్మదయులు
ధర్మదూగులు దయా ♦ దాన వివర్జితు
ల్విహితా హితకృతి ప్ర ♦ వీణమతులు
సంచిత పాతక ♦ పంచకు లుపపాత
కాశ్రియభూతు ల ♦ నాశ్రవస్థు
లై భూమిజనులు మ ♦ హానరకంబులఁ
బాల్పడి తెఱువు చూ ♦ ప్పడమిఁ బడమి

ఆ॥ వె॥ హీన యోనిఁ బొడమి ♦ యానెటి నుడి నుండి
నుడికిఁ బోయి తిరుగు ♦ సురిగలట్లు
మొదలుఁ దుదియు లేని ♦ ముప్పునఁ బడిరట్టి
వారి నుద్ధరింప ♦ వచ్చు నెట్లు॥

చం॥ తప మొనరింప లేరొకట ♦ దానము సేతకుఁ బెంపు లేదక
ర్మపథ మెఱుంగ రానిది య ♦ మానుషమాత్రవిచార
మెట్టులీ । కుపురుషులొక్కసారిగ ల ♦ ఘుప్రతిపత్తిని
హాపరత్రభో । గ పరతఁబాప పర్వత మ ♦ గల్చి భవా
బ్ధిఁ దరింతురో గదే॥

కం॥ శ్రీరమణ? తలచినంతన
పార మహాదుఃఖ జలధి ♦ పాల్పడు మన మ
వ్వారలు సుఖింపఁ గృప నై
వార నుపాయంబుఁ జెప్పి ♦ పాలింప గదే?॥

కం॥ ఏ దేవు నే వ్రతంబున
నే దారి భజింపవలెనొ ♦ యెయ్యది ఫలమో
శ్రీదయిత? దీన మున్నెవఁ
డాదృత కరుఁడై మహార్థ ♦ మందెనొ చెపుమా?॥

తే॥ అనినఁ జిర్నగ వాస్యమ్ము ♦ నాము కొనఁగ
నాథుఁ డమ్మునినాథ స ♦ న్మాన్యుఁ గాంచి
వత్స? ప్రశ్నించితివి దీన ♦ వత్సలస్వ
భావమున నింకఁ జెప్పెదు ♦ వాఁడ వినుము॥

నారదమునికి మహావిష్ణుండు సత్యనారాయణవ్రత విధానము నుపదేశించుట.

మ॥ అతి లోకం బఖిల ప్రదాన చణ ♦ మార్యా? సత్యనారా
యణ । వ్రతమద్దానను సత్యదేవురమనా ♦ ధ్యానించి
పూజించి యా । యతభక్తిన్జను లామయం బెడలధా ♦
న్య ద్రవ్యసౌభాగ్య సం । తతి పర్యాప్తి సుఖింతు రిచ్చటను
మో ♦ దంబందు వారచ్చటన్॥

సీ॥ ఏ దేని దినమున • నీ హితనియముండై
విప్రులు బంధుగు ♦ లెవ్వింట నమున
దేవతాయతన న ♦ దీ దేశముల కేగి
సాయం సమయమున ♦ సత్యయుక్తి
సత్యనారాయణ ♦ స్వామినిఁ బూజించి
గోధూమ చూర్ణంబు ♦ గోఘృతంబు ।
పాలు ద్రాక్షలనంటి ♦ పండ్లు శర్కరయునుఁ
గలిపిన నైవేద్య ♦ కంబొసంగి

తే॥ కథను విని విప్రవరులకుఁ • గాన్క లొసఁగి
యందఱు భుజింపఁజేసి య ♦ నంతరమునఁ
బతి ప్రసాదంబు నైదవ ♦ పాలు మెసవి
జాగరంబు మహద్గోష్ఠి ♦ సలుప వలయు

ఆ॥ వె॥ అంతసత్యదేవు • నాత్మదలంచుచు
నిమ్ముఁజేరికోర్కె ♦ తెలమిఁజెసయ
మానవుఁడుసుఖించు • మఱియింతకన్నసి
కలి లఘుప్రసక్తి ♦ గలుగఁబోదు ॥

ఆ॥ వె॥ కులముగోత్రమనుచుఁ ♦ గలిమిలేమియటంచు
నసమయంబు సమయ • మనుచులేద
యెవ్వఁడెప్పుడెట్టు ♦ లేనిఁబూజించుఁబో
ఫలముగలుగు నెడఁద ♦ భక్తియున్న ॥

కం॥ ఈజన్మము సఫలముగా
భ్రాజిష్ణుండగుచు దేవ ♦ పథమునఁజనుఁ ద

త్పూజనమొనర్చు నరుఁడ
వ్యాజంబగు భక్తికలిమి ♦ భవముఁ దరించున్ ॥

కం॥ నీసంశయ మెడలఁగ నితి
హాసంబువచింతునొక్కఁ ♦ డదియు మొదలఁద్వ
త్ప్రాసంగికంబ యావధా
నాసాదిత చిత్తవృత్తి ♦ నదిజేర్పుమునీ ॥

కాశికాపురివర్ణనము.

సీ॥ వాఙ్మనఃకాయిక ♦ పాపమలంబులఁ
గడుగునెచ్చోటఁగం ♦ గాభవాని
యాకలితెక్కలి ♦ యడఁగించు నెచ్చోట
నన్నపూర్ణమ్మ పా ♦ యసమొసంగి
పాలించు నెచ్చోట ♦ భైరవమూర్తియం
తశ్చరచోరసం ♦ త్రాస ముడిపి
యెచ్చోటఁదగుతరి ♦ నీశభావంబిచ్చుఁ
జెవిలోననేమేమొ ♦ చెప్పివిభుఁడు

తే॥ నుర్విఁగలవారికదియ మ ♦ హోదయంబు
పుడమియునితరసామాన్య ♦ భూషణంబు
కలుములకుఁ బాలవెల్లియై ♦ వెలయునలవ
రాలగని రాజశేఖరు ♦ రాజధాని ॥

కం॥ సుస్పృహఁదస్కరుతోఁడఁబృ
హస్పతియాకృతిగణంబు ♦ నందెనసెఁబదం
బాస్పదమె తెల్వికింక వ
నస్పతియట్టిఁడని యచట ♦ నగుదురువిబుధుల్ ॥

కం॥ రాజన్యుల మగుమాత్రో
రాజనఁ డారాజు తులకు ♦ రాఁ జెడిపోఁడో
రాజీవమిత్రుఁడే సరి
యాజి భృగుజుఁ గెలిచెనాయ • టందురు రాజుల్॥

గీ॥ ధర్మమెఱుఁగని ధనదుఁ డా ♦ తర ల వేల
యని కుబేరుని నిరసించు ♦ నట్టి వైశ్య
లలఘుకృషి నిష్ఫలంబని ♦ హాలినిఁ దెగడు
నట్టి తుర్యులు నివసింతు • రచటనోలి॥

సీ॥ కేలీశుకాలాప ♦ లీలావిహ్వలలోక
బాలాసములాస ♦ భాసురంబు
కాలిద్విగాలీక ♦ లాలీన సురసాల
పాలీసు మారామ ♦ భావితంబు
లోలన్మరాలీమృ ♦ ణాలీ ప్రణాలీవి
శాలీ భవత్సర • శ్శాలమాన
మేలాల తాలాల ♦ నాలిప్రకర చాల
నాలీఢమారుతాం ♦ దోళితంబు

తే॥ నీల మణిమాలికాత్కరా ♦ భీల కేతు
కీలితదుకూల ఖేలాను • కూల మాల
తీలతా లసమానాళి ♦ వేలమంజ
గీల లత్సమ దాళి త ♦ దాలయమ్ము

సీ॥ పురిలోని దేవళం ♦ బులపొంత రథ్యలఁ
బొడవైన మసనంపు ♦ భూమియందు

రుద్రాక్షమాలికా ♦ భద్రహస్తులయందు
వెలిబూదె యలమిన ♦ వేసమందు
వృత్తివల్లరులావ ♦ రింపని మనముల
జుత్తిమెత్తిడి నట్టి ♦ భావమందు
నొకపూటతిని నేల ♦ నొదుగుత్తై ర్థికులందు
నేమియులేనట్టి ♦ గీమునందు

తే॥ జండశాసనుఁడఁట దయా ♦ సాగరుఁడఁట
బ్రాహ్మణుండట ఱేఁడట ♦ ప్రజలదొసగు
లెఱుఁగుకొలకు విశాలాక్షి ♦ యెలమిఁగొలువఁ
గేలి విహరించునట యొం డ ♦ కించనుండు ॥

సీ॥ అనురాగపథముల నపరాగవీధులఁ
బ్రజలకు నెపుడులో ♦ పములులేవు
సావజ్ఞ మతుల న ♦ నవధానబుద్ధు ల
విధులకు నొకట న ♦ న్యథలులేవు
ధర్మంపుదీపుఁ-లఁ ♦ దరుణ చంద్రాభలఁ
దాత్వీక పక్షపా ♦ తములులేవు
శస్త్రయుద్ధంబుల ♦ శాస్త్రవాదంబులఁ
దమవారికెందు నొ ♦ టములులేవు

తే॥ చొరదలంచిన లేమికిఁ ♦ జోటులేదు
సిరికి నొండెడ నడుగిడ ♦ సెలవులేదు
మిత్తి తనయిచ్ఛఁ జన దప్ర ♦ మేయ మహిమ
మునఁ బ్రవర్తిలు నయ్యాకిం ♦ చనుని వీఁట ॥

## బీదబ్రాహ్మణుని కథ.

ఉ॥ ఆపురిచారుకాశి నియ ♦ తాత్ముల పాలిటికల్పవల్లి భో
గాపణమచ్చటం గలఁ డ♦నాథ్యుఁడు విప్రవరుం డొకండు భి
క్షాపరుఁడై చరించెడు నొ ♦ కంటనుఁ బూడదు బొజ్జ యెప్పుడే
పాపమొనర్చెనో యను భ ♦ వంబునఁ గాక మఱొంటఁ
దీరునే ॥

తే॥ అకట తిలరాశిలోఁ బొర ♦ లాడెనేని
నంటునది యంటుగాని భా ♦ గ్యమున కెవఁడు
కర్త! దయలేని వాఁడెశం ♦ కరుఁడు నరుని
యిచ్చ మెయిఁ బోయి తటిత్రోన ♦ మెచ్చుఁ గాక ॥

కం॥ ఆవిప్రుం డొకపరి భి
క్షావిధిఁ బురిఁ జుట్టివచ్చి ♦ కానక కాంచెన్
శ్రీవిస్ఫార కటాక్ష ద
యావర్షు నదృష్టపూర్వ ♦ నవసీ ద్విజునిన్॥

కం॥ తన వృత్తాంతం బాద్విజుఁ
డనుకంపాయత్తుఁడగుచు ♦ నడుగం బ్రథముం
డను వినుమా నుడివెద ననుఁ
బునీతుఁ జేయంగఁ దలఁపు ♦ పుట్టెనొ నీకున్ ॥

తే॥ బ్రాహ్మణోత్తమ యేనును ♦ బ్రాహ్మణుండ
నాకలియు డప్పి తీరని ♦ యట్టివాఁడ
మొక్కలంబు కుటుంబంబు ♦ మోవలేక
తిరుగుచున్నాఁడ దొరకదు ♦ తిరిపెమేని ॥

సీ॥ పదుగురిలోమాటఁ • బాటికిరానీదు
మోమున నెసకంబు ♦ పొడ వడంచు
శాస్త్రార్థచర్చాప్ర సక్తికిఁ జోటీదు
మతికి ననుత్సాహ • గతి నమర్చు
నప్పుడబ్బినదాని కానంద పడనీదు
రేపులేదనుచింత ♦ కేపుసూపు
నభిమానవుంద్రోవ ♦ నడుగిడఁ బోనీదు
క్షుత్పిపాసలకు నా ♦ కూత మొసఁగు

తే॥ ప్రాణములఁ బోచు చే పురు ♦ షార్థమనుచు
నార్తిచెప్ప నొకప్పుడు ♦ నార్తి గలదు
తరుణి సుగృహీ తనుదరిద్ర ♦ తావధూటి
నేలుమాకునుఁ బరమాత్మ ♦ కెంత దవ్వు ॥

ఉ॥ ఆయతమానుఁ గన్గొని మ ♦ హా ద్విజుఁ డో మహనీయ
సత్యనా । రాయణమూర్తిఁ గొల్వుము వ్ర • తాప్తి నతం
డుఁ దొలంచు దోసమున్ । శ్రీయు వరించు నిన్ను నద ♦
సీయవిధాన మిదంవిధంబటం । చాయను వెల్లఁ దెల్పి
చనె ♦ నంతను సంతసమందె విప్రుఁడున్ ॥

కం॥ ఆ మహితుఁడు మడివిన వ్రత
మామెయిఁ బొనరింతు నేఁ గృ ♦ తార్థుఁడ నగుదున్
శ్రీమెలవుఁ గాంతు నను చిం
తామతి నిద్దురయు నిశయుఁ ♦ దలగె నతనికిన్ ॥

చం॥ చయ్యన లేచి స్నానమును♦సంధ్యయుఁ దీర్చి ప్రపత్తి స
త్యదే । వయ్యను నేఁడు గొల్తునని ♦ యాత్మఁదలంచి తద

ర్థనార్థమై । యెయ్యెడ కేగనేనియు మ ♦ జింత ధనంబొడఁ
గూడె నాఁడు మే । లయ్యె నటంచుఁ దద్వ్రతము ♦ నాతఁ
డొనర్చె యథాయథంబుగన్॥

ఉ॥ త్రొక్కినఁ బంధు నీప్సితము ♦ తోయమునన్ధరణీతలంబు
పెం । పెక్కిన కూర్మినిత్తురు మ ♦ హీశ్వరులుం దఱిఁగాం
చి కాంచనం । బొక్కట యాచమానులు మ ♦ హాహా
దయమంది నుతింతు రెంతయు । న్నిక్కిలి యయ్యె భాసు
రుఁడు నీమము కామము లీయఁజాలదే॥

తే॥ గీ॥ అంతనుండి ద్విజోత్తముం ♦ డర్థమాస
మునకు మాసంబునకు • దేవముఖ్యు గొలువ
జొచ్చె నొకసారి వానిల్లు ♦ సొచ్చెఁ గట్టె
లమ్ము కొనువాఁడొకండు తృ ♦ షార్తుఁడగుచు॥

కట్టెలమ్ము వాని కథ

తే॥ గీ॥ ఆకలియుఁ బోయె దప్పియు ♦ నంతరించె
జెలగె నుత్సవ మాతని ♦ చిత్తసీమ
నేమి నోము ఫలంబొ? యయ ♦ ప్పామరునకు
నల్లదేవునిపై భక్తి ♦ యంకురించె॥

క॥ వ్రతమునుఁ గనుఁగొని కథన
స్మృతిని విని ప్రసాదముఁ దిని ♦ మహానియుండా
క్షితిసురునిఁ గొలిచి యాతం
డతులిత మద్వ్రత విధాన ♦ మంతయు బడసెన్॥

ఉ॥ ఈ రహిఁ సంతసం బెనసి ♦ యింధన బంధన మెత్తి నెత్తి
పైఁ । జేరిచి యాతఁ డీవ్రతముఁ ♦ జేయుదు. నేనును దీని

నమ్మి చే | కూరిన తద్ధనంబున న ♦ కుంఠ వికుంఠసుఖం
బు మూటగా | ధారుణి మించువాఁడనని ♦ తాఁజనియె
ద్ధనవంతు లిండ్లకున్॥

కం॥ ఆ నాఁటి కటు కదేమో
కానీ కానీకి మోడిఁ ♦ గై కొను వారై
పై నేగి మూగి కొని కొని
రానరుఁడు తలంచి నంత ♦ కంతయు నిడుచున్॥

తే॥ గీ॥ తగని వెలవెట్టి యల్పమ • ర్ధంబుఁ గొనఁగ
నెట్టివారలె వారలు • విధివశమున
నవియుఁ జందన కాష్ఠంబు ♦ లయ్యె నేమొ
సత్యదేవు ప్రసాదంబు ♦ సరణి యనదె?॥

తే॥ అంతసంతసమంది వాఁడా ధనమున
సత్యనారాయణ స్వామి ♦ సద్వ్రతంబు
నాచరించె విధానంబు ♦ ననుసరించి
బాంధవులతోడ సద్విజ • వరులతోడ॥

కం॥ ఆవిప్రువోలె నాతఁడ
నావిలమతియుక్తి నధిగ ♦ తైశ్వర్యుండై
భూవిబుధుల నావిబుధుల
సేవించెఁ దరించె భవము ♦ సిద్ధ మునీంద్రా॥

ఆ॥ వె॥ కట్టెలమ్మువాఁడు ♦ కనకమ్ము ముడివైచె
వాని కీర్తి విబుధ • వరులు పొగడి
రంతకాలమున న ♦ పార్వతిఁ గూడె వాఁ
డింక చేని నెవ్వ ♦ డెనయ లేడు॥

కం॥ తపసీ? దాపఁగనేలా?
యుపచారము లొక్క వేయి ◆ యొనరించియు ని
క్కపు ఫలమొనయఁడుమానవుఁ
డపచారం బొండొనర్చి ◆ నా వ్రతయుక్తిన్॥

తుంగధ్వజోపాఖ్యానము.

మ॥ వినుతుంగధ్వజుఁడన్న పార్థివుఁడు ము ◆ న్విఖ్యాతుఁడై
లోకపా। లనముం జేయుచువచ్చెఁ బుత్రశతము ◆ ల్లాసంబుఁ
గల్పింపనా। జననాంథుడొకసారి వేటపయి ను ◆ త్సాహం
బు దీపింపఁగా। ననసీమందగువారు గొల్వఁజనియెం ◆ దర్పం
బనల్పంబుగన్॥

కం॥ కుక్కలతో నొక కొందఱుఁ
బక్కలెనసి కొందఱలమి ◆ వాటించుచురా
నుక్కుమిగిలి మఱికొందఱు
పెక్కువలలుఁగొనుచుఁ జనిరి ◆ పృథివీశునితోన్॥

కం॥ బల్లెము లీటెలు గత్తులు
విల్లమ్ములుఁదొడిగి భటులు ◆ వెంటనడువ భూ
వల్లభుఁడుఁ దగినవేసం
బుల్లసిలఁగఁ దురగమెక్కి ◆ యుత్కతజనియెన్॥

మ॥ చని యాకాననసీమ తల్లడిలు ను ◆ త్సాహంబునం బేర్చు
యె। ధనికాయంబున ఉబ్బసంగుచుధరా ◆ దారుండుభూ
దారబా। ధనము న్మన్నొనరించె నాలిదెసఁదా ◆ త్పర్యంబ
నానేలశ్రీ। ఘనుఁడెప్పాట సహింపనేర్చునె నిజాం ◆ కంబూ
ను నత్యల్పునిన్॥

శా॥ వ్యాఘ్రానర్ఘ పరాక్రమాక్రమచణ ♦ ప్రారంభ సంరంభ సం
ఘుద్బాణకలాకలాపకలనా ♦ శింజానమౌర్వీనినా
దాఘ్రాణద్రుతకాందిశీక మృగచ ♦ ర్యావాప్తభీత్యుచ్చల
చ్ఛిఘుప్రక్రమవిక్రియా కలకలా ♦ చ్ఛిన్నోత్సుకత్వాత్తుజ॥

సీ॥ ఏనిక లచ్చియౌ ♦ జెటిఁగిపాలింపఁగా
సింహాసంహాతులను ♦ సంహరించెఁ
గానలఁదపసికిఁ ♦ గానిధర్మంబని
ఖడ్గిసంఘాతంబుఁ గాసివటిచెఁ
బెద్దలదరి విట్ట ♦ వీగుట తగదంచు
చమరీసమితి చామ ♦ రములనుడిపెఁ
తనజక్కికోలముతోఁ ♦ దగనివేరముఁబూను
కాసర జాతిఁజ ♦ క్కాడివిడిచె

తే॥ గీ॥ బర్హములఁజూచిసైరించె ♦ బర్హికులము
హరిణముల కాన్పుమెచ్చెన ♦ న్నరవరేణ్యుఁ
డేమిదోసంబొగానమే మెు ♦ మెవనికెఱుక
చెలయునిచ్చెనఁ ప్రభువుల ♦ చిత్తవృత్తి॥

కం॥ ఈరీతిఁ గొంతతటి మృగ
యారతి మతియుల్లసిల్ల ♦ నాభూపతి పెం
పారుతిమిరారిగతి నా
వ్వారితినని చేరెనొక్క ♦ యువనీజమ్మున॥

చం॥ నరపతియున్న చక్కటి వ , నస్పతినీడవసించి గొల్లవా
రరుసముభక్తి యున్మిగుల ♦ నమ్యోడఁజేసిరి సత్యదేవుసం

బరమదిజూచి యుందురభి ♦ మానముపెర్మినతండుమానెనా
ధరణికిఁబోవుకోర్కి నృప దర్పము ధర్మమెఱుంగనేర్చునే? ॥

కం॥ గోపాలకులయ్యెడ నా
భూపాలకుఁగాంచిమ్రొక్కి ♦ పుష్పఫలాది
శ్రీపాలకప్రసాదం
బేపారెడుభక్తినొసఁగి ♦ యేగినయంతన్॥

కం॥ నేనెక్కడ వీరెక్కడ
నీనీచులొసంగువారె? ♦ యేఁ దినవలెనే?
పోనిమ్మనుచుఁబ్రసాదముఁ
దానన్యులకిచ్చుమెయిన ♦ త్యాగమొనర్చెన్॥

తుంగధ్వజుఁడు సత్యనారాయణస్వామి ప్రసాదమును దిరస్కరించిన కతన పెక్కునాపదల నొందుట.

శా॥ ఆ భూభృద్వరు గర్వపర్వతము న ♦ ల్పాంహోగ్రాగిరింగ
న్నఁద ద్భూభాగంబున నాపదాపగయుఁ బ్రా ♦ దుర్భావ
ముంగాంచి చిం । తాభిన్నోదక యుక్తిశోక జలధి ♦ స్సా
నించి పూరించెఁద । త్క్షోభం బెల్లజగంబుడంబొకట ను ♦
తూఁకాలించునట్లుండఁగన్॥

ఆ॥ వె॥ ప్రకృతులందులోని ♦ పగలుమిక్కుటమాయె
నతని పుత్రశతక ♦ మంతరించె
నోలి రాష్ట్రమందు ♦ నుత్పాతములుఁ దోచెఁ
బూఁచెఁ గలియుఁబాప ♦ భూజమేచె॥

ఉ॥ అంతటఁ దెల్పఁదెచ్చుకొని ♦ యప్పుడ గొల్లలఁ బిల్వఁ
బంచి భూ । కాంతుఁడు గౌరవించి తన ♦ కల్మషమెంచి
విభున్నుతించి దు । శ్చింతఁదొలంచి వారు తన ♦ చెల్మి
మనన్నియమించి తద్వ్రతం । బెంతయు భక్తియోగమెల ♦
యించి యొనర్చె సదంచితంబుగన్ ॥

తుంగధ్వజుఁడు సత్యనారాయణవ్రతము నాచరించి సకలసంపదలఁబడయుట.

తే॥ మఱల సంతానవంతుఁడై ♦ మంత్రిముఖుల
సౌమనస్యంబు పటిష్ఠ రా ♦ ష్ట్రంబువిగత
దౌర్మనస్యంబుగా ధన ♦ ధాన్యవృద్ధిఁ
బాప మెడలించి కలిఁద్రుంచు ♦ భాగ్యమెనసె॥

ఉ॥ ఆకులపాలు డావ్రతము ♦ నామెయినాఁడు మొదల్పొన
ర్చి యా । లోకము మేల్మిఁగాంచి పర ♦ లోకములొక్క
టనాచముట్టగం । దేవసంతరించె విను ♦ ధీమహనీ
య గుణప్రవీణ వి । ద్యాకలితాంతరంగ యిది త। ద్వ్రత
తత్వ మగోచరమ్ములన్ ॥

తే॥ ధనముఁ గాంచు దరిద్రుండ ♦ దఃప్రసక్తి
బ్రహ్మచారి గృహస్థుఁడౌఁ ♦ బడయుసుతులఁ
బుత్రరహితుండు విద్యార్థి ♦ భూరిపండి
తుండగు నిరీహుఁడేని ని ♦ స్తులత నెనయు॥

తే॥ వ్రతములందున నుత్తమ ♦ వ్రతమునుమ్ము
కలియుగమ్మున దురిత సా ♦ గరముదాటఁ
దలఁచు వారికివంతెన ♦ దారినిదియు
నొసఁగు నిరపాయమగు దారి నుచితకారి॥

క॥ అని సప్రేమానందా
సన కమలామోద భరము ♦ నం గూర్చికథా
పనితామృత మొసఁగు హరి
న్ముని ముఖ్యుఁడు సంస్తుతించి ♦ పోయె నిజేచ్ఛన్॥

క॥ స్వస్తిప్రజాభ్యయనుచుం
బుస్తకమును ముడిచె సూరి♦పుంగవుఁ డపుడా
యాస్తికునిఁ బూజసేసె స
మస్తధరాకాంతుఁ డర్ఘ్య ♦ మణికనకములన్॥

తే॥ మొగిఁ బ్రసాదమ్ము వినియోగ ♦ ముంబొనర్చి
నాల్గుజాతులకును భోజ ♦ నములఁ దృప్తిఁ
గూర్చియొగి దక్షిణేయుల ♦ కును ధనమ్ము
లొసఁగి యింటికిఁ బోఁజూచె ♦ నొడయఁడపుడు॥

శ్రీవర్ధనుడు నిజపురము ప్రవేశించుట.

క॥ ఆ కోమటిమానికమా
భూకాంతునిఁ జేరివ్రతముఁ ♦ బూను విధానం
బేకమతనరసి వీడ్కొని
శ్రీకలితుండగుచు నిల్లుఁ ♦ జెచ్చెరఁజేరెన్॥

ఉ॥ వచ్చిన నాథుఁగాంచి తన ♦ ప్రాణములప్పుడ లేచివచ్చిన
ట్లచ్చపలాక్షి డగ్గఱి కృ ♦ తాంజలియౌచు నమస్కరించి వై
యచ్చరపాళిమెచ్చఁ బతి♦ యాదరణంబెనయించుచుండగా
మచ్చికఁజేసి యేకతమ♦ మానినికాధన మానియిట్లనున్॥

తే॥ గీ॥ అంగములు సంగతమ్ములె? ♦ యతివమిన్న?
చిత్తమొక్కింత యవధాన ♦ వృత్తిఁగనునె?
నన్నువాసినకతమునఁ ♦ జెన్నుదఱిగి
యున్నకన్నుల బన్నమ్ము ♦ లుడుపరాదె॥

తే॥ పద్మముఖి? నిన్నుఁబాయుదా ♦ ర్భాగ్యమెనసి
యొలయు పరదేశవాస బా ♦ ధలసహించి
లాభమున కేమికాని వి ♦ లాసవతిరో?
కీడులో మేలుఁ గనఁగంటి ♦ ఖేదమెడల॥

శ్రీవర్ధనుడు నిజకాంతకు సత్యనారాయణ వ్రతమహిమము దెల్పుట.

ఉ॥ ఎన్నిదినంబులేనిఁ జనె ♦ నింతకుటుంబము విస్తరించు నా
సన్నయొకింతయుం గనమి ♦ సౌఖ్యముగల్గదు చిత్తవృత్తికి
న్నన్నుతగాత్రి? సంపద ♦ లసంగతికిం గుఱయైనఁ జేఁడొకం
డన్నులమిన్నతో నొక మ♦హావ్రతముం బొనరింపఁజూచితిన్॥

తే॥ ఎల్లనోముల నుత్తమం ♦ బిహముఁ బరముఁ
గూర్చుఁ దత్పరులకు నెల్ల ♦ కోర్కులొసఁగుఁ
దవిలి యనపత్యులకును సం ♦ తానమిడుఁ
గలియుగంబునఁ బేర్పడెఁ ♦ గామ్యగాక్షి? ॥

తే॥ తలిగుఁ బోఁడిరో? మన కప ♦ త్యంబు గలుగు
దారికన్పట్టెనేనిఁ ద ♦ ద్వ్రతమొనర్చి
సత్యదేవుని కింకర ♦ కృత్యమెనసి
దేవవహాళి ఋణమ్మునేఁ ♦ దీర్చుకొననె?॥

కం॥ అనుటయుఁ గొనముల యాలయు
మునుఁ బోని తదీయపత్ని ♦ భోధించివ్రత

మ్మనుమున్న సేయరాదే
విను దేవునితోడ మోడి • విహితమె మనకుఁ ॥

తే॥ అనిన నాతండు నల్కునో ♦ యన్నమిన్న?
మనకువలె నాసలేదె దే ♦ వునకుమాత్ర
మింతురో? పల్కకుండుమీ ♦ వింతకిపుడు
పనియుఁదీ ఆీ నశ్రద్ధచో ♦ ప్పడునె పడతి?॥

కం॥ అనిబుజ్జగించి లలనా
ఘనతను లతికాలసద్వి ♦ కాస విలాసాం
జనలోల మనః కలికా
కనదా మోదప్రసంగ • కలన సుఖంచెఁ ॥

కం॥ ఈరీతి నాలుమగఁడుం
దారుణ్యానుప్రసక్త ♦ దర్పకచేత
స్ఫారరతి భూతశుచిరస
పారమ్యమునం బెనఁగిరి ♦ భావమువొంగఁ ॥

అ శ్వా సాం త ము .

కం॥ కనుమూరి వంశసంభవ
జనవరపూజిత పదాంబు • జాతజయశ్రీ
వని తాశ్రయ భుజశిఖరా
వనచర రథినీవిశిష్ట ♦ వర్ణ్యచరిత్రా ॥

స్వాగత॥ రామరాజిగుణ ♦ రాజిసమర్చా
స్థేమచిత్తసర ♦ సీ జమ నోజ్ఞా
ధామనిర్జిత ప • తంగ? ప్లవంగ
స్వామిరాజ్య సుఖ ♦ సాధనబుద్ధీ ॥

గద్య
ఇది శ్రీమదుమామహేశ్వర చరణనళిన నిత్యసేవాసమాసాదితా
నవద్య కవితా యోగహృద్య మహితాత్రేయ గోత్రపవిత్ర
హనుమత్సుధీతనయ విదితనయ లక్ష్మ్యంబా
గర్భశుక్తి ముక్తాఫలాయమాన వేంకటకవీం
ద్రాత్మజత్వా నూన హనుమాంబాళమీ
గర్భ హావిర్భు జాయమాన
రాఘవనారాయణా భిదాన
ప్రణీతంబైన
శ్రీ సత్యనారాయణ వ్రత మాహాత్మ్యంబునందుఁ
ప్రథమాశ్వాసము.

---

# సత్యనారాయణ వ్రతమాహాత్మ్యము.

## ద్వితీయాశ్వాసము.



కం॥ శ్రీరంజిత భక్తజనా?
భూరామాభార హారి ♦ భుజబల! సీతాం
బారచితోచిత భవన వి
హార ప్రీతాత్మభావ ♦ హనుమద్దేవా? ॥

ఆ॥ వె॥ అవధరింపుమయ్య ♦ యామీదివృత్తాంత
మనఘ? ఘనపురాణ ♦ మైనయట్టి
స్కాందమందు నవర ♦ సమగు రేవాఖండ
మందు వర్ణితమగు ♦ నలక్రమమున ॥

కం॥ ఈవిధిఁ గొన్నాళ్ళు చనన్
శ్రీవర్ధనునింటి లచ్చి ♦ చెలువముఁగను లీ
లావతికి సత్యదేవు ప్ర
భావంబునఁ గడచె రెండు ♦ పక్షములంతన్

కం॥ ఉర్విఖ్యాతుచు నాథుం
డవ్వనితం జేరిపలుకు ♦ నలివేణీనీ
మవ్వముఫలించె నోకో
యవ్వలి కేగెడు దినమ్ము ♦ లటునిటుఁ బడియెన్ ॥

ఆ॥ వె॥ అనిననాథుఁగాంచి ♦ యానతమౌళియై
సిగ్గు సందియమ్ముఁ ♦ జెందు మనసుఁ

గప్పి పుచ్చికలికి ♦ కాంక్షిత ప్రదమైన
వ్రతము నిపుడ చేయ ♦ రాదె యనిన ॥

చ॥ కవకవ నవ్వుచుం బలుకుఁ ♦ గాంతుఁడు కాంతరొ యెంతపిచ్చి
దా। నవొ యొకయింత యిల్లలికి ♦ నంగడఁ గాంచెన పం
డువెల్లనిం। తవడికి నోమునోచిన వి ♦ ధాతకుఁ దప్పదె శ్రద్ధ
నిశ్చయం। బవుపనిఁ గాంచి కాక యన ♦ యంబుఁ ద్వరం
బడువారె మాదృశుల్ ॥

కం॥ ననునమ్మఁడె హరియని చెం
దిన శంకంగదుటఁ బడునొ ♦ ద్రిండునఁ బడునో!
యనుచుంగనుఁ గొనుచుండఁగఁ
జనె నింకొక నెలయు వాని ♦ చానకునంతన్ ॥

తే॥ ఇచ్చ రచ్చలకెక్కెనా ♦ మచ్చెకంటి
వెచ్చదన మూనె నూర్పుల ♦ వితతి యందు
నల్లనల్లన చనుమొన ♦ లందు నారు
నందు నీలిమకలిమితో ♦ నడుగు వెట్టె ॥

తే॥ మదికి నెల్లెడభోగేచ్ఛ ♦ మలయుకోలఁది
గరణములు కారణములేని ♦ కలహమూనె
నలస భావంబు చూపట్టె ♦ నతివమిన్న
చేతిగతియందు నెమ్మదిఁ ♦ జిత్రమేమొ ॥

ఉ॥ చెక్కులు తెల్లనయ్యె విధి ♦ చెద్దయము మెల్లనఁ దెల్లమ
య్యెనా। పొక్కిలి చిక్కనయ్యె నడు ♦ ముంగడు మొక్కల
మయ్యె నవ్వళు। లెక్కకురాని వయ్యెఁదమ ♦ లీలలు భావ

ములయ్యెఁ దోఁచెనా। చక్కెరబొమ్మకు న్మృదను ♦ షక్త
నిరుక్తరసానుబంధముల్ ॥

తే॥ గీ॥ గర్భగతమైన యలదేవు ♦ నిర్భరమగు
తేజు వెలివాఱె నన్నట్లు ♦ తీవఁబోఁడి
మేలిమేఁ దీవ కాకక్రొత్త ♦ మెఱుఁగు వచ్చె
నోఁచి నెలకల లోనూను ♦ ప్రాచికట్లు ॥

తే॥ పూఁచు కెందమ్మి మకరంద ♦ పుంజమనఁగ
నిందు బింబంపు నమృతంపుఁ ♦ బిందువనఁగ
కలికి చెలువైన యాస్యావ ♦ కాశమందు
జుక్కలనఁ జెమ్మటలు గ్రమ్మెఁ ♦ జూచ్చెనోలి ॥

కం॥ ఈలీలఁ గొన్ని నెలలా
లీలావతి కడపిపుచ్చి ♦ లీనమనస్కన్
శ్రీలలితు దయితుఁ గన్గొని
వాలాయ మొనర్పరాదె ♦ వ్రతమికయనియెన్॥

ఉ॥ ఆతఁడు ప్రేయసింగని వి ♦ హాయసమెక్కి వచించు సుం
దరీ? ప్రీతి వహింపు మెట్లయిన ♦ వేల్పుల మ్రొక్కులు వే
యి యేండ్లు కా। నే? తనకింత సందియమ ♦ దేల యప
త్యము మోముఁజూచి సం। జాత కుతూహలుండనయి ♦ స
ల్పనె యొయ్యవియేని మానినీ॥

కం॥ ననుఁబోఁటి వానినమ్మక
విను దేవుం డేమిసేయు ♦ వినతోదరి? యీ
పనియుందీరినఁ దీర్పనె
యనఘాత్మునిమ్రొక్కు లెంత ♦ యలజడి వడియున్ ॥

తే॥ అనిన మేలగుఁ గాతమం ♦ చాలతాంగి
యతని నెలయించె నర్హ వా ♦ క్యప్రసక్తి
నంతమతికొన్ని మాసంబు ♦ లవలఁ జనియె
సన్నిహితమయ్యెఁ బ్రసవించు ♦ సమయమపుడు ॥

తే॥ మెత్తవడియున్నదనియు న ♦ మ్మెలత యోర్పు
లేనిదనియు నియ్యదిలేక ♦ లేకవచ్చె
నంచు నేమేమొ తలచి రా ♦ వించె వాఁడు
మంత్రసానుల వైద్యుల ♦ మంత్రపరుల ॥

కం॥ కలవారియిండ్ల జొప్పడు
నిలనన్నియు యుబ్బురంబు ♦ లింతియ యడవిం
గలజంతువులుం గనవే
కలవేయివియెల్లదైవ ♦ ఘటనకు మాటే ॥

ఆ॥ వె॥ ప్రసవ వేదనలకుఁ ♦ బొల్పెడి పూఁబోడి
యలయుచుండ నెదియు ♦ నసురు వార
లాతఁడొక్క రూక ♦ యలదేవు ధ్యానించి
ముడుపుఁ గట్టె మూఁడు ♦ ముడులు వైచి ॥

లీలావతికిఁ గన్నియ జనించుట.

తే॥ అంతఁ గన్నియఁ బ్రసవించె ♦ సతనియాలు
నోలి వైద్యులు నిండుగ ♦ యుండలిడిరి
భూతవైద్యులు సేసిరి మా ♦ పున్నె మనుచు
మంత్రసానులు మాసుసా ♦ మర్థ్యమన్నిరి ॥

ఉ॥ అందఱ సత్కరించి యతఁ ♦ డాపదినాళ్ళఁ దొదియు రక్షు
ణం। బందుఁ బ్రమాదముం గనని ♦ యమ్మెయినుండి యనంత

రంబ త। న్మందిర మాత్మ శోభ గగ • నంబుల వెన్నెల
యించుదానిలీ| లం దిలకించి పేరిడెఁ గ ♦ లావతియంచు
బుధు ల్నుతింపఁగ౯॥

శ్రీవర్ధనుఁడు సత్యవ్రతము నెడ విముఖుఁడగుట.

తే॥ కాఁదగినయంత వ్యయమునుఁ ♦ గాకపోవు
నోటు మనసత్యదేవుని ♦ మాటమాత్ర
మతఁడు తలపెట్టఁడాయెని ♦ ల్లాలువలుకఁ
బలుకఁడాయె నయారె లో ♦ భంబు మహిమ॥

కం॥ చనవు మెయి న్వెంబడిఁ బడి
వనితామణి పోరిపోరి • ప్రశ్నింపఁగ నా
జనుఁ డిద్దాని వివాహం
బునఁ బొనరించెదను సత్య ♦ పూజన మనియె౯॥

సీ॥ అచ్చంపు వెలుఁగున నమృతంపుఁ దడిఁజేర్చి
మెదిపి చేసినతీవ ♦ యిది యనంగ
నుజ్జ్వల రసమున ♦ నొగిఁబూఁత మెఱుఁగిడ్డ
కమ్మనిక్రొంపు ♦ బొమ్మయనఁగ
శ్యామికఁ బోకార్చి ♦ చల్దనమ్మున వల
పులనదికిన చంద్ర ♦ కలయనంగఁ
బూఁబోడి మోహన ♦ మునదార్చి తీర్చిన
వెడవిల్తు నమ్ముల ♦ వేదియనఁగ

తే॥ నగుట పొరలుట లేచుట ♦ నలిఁ బలుకుట
నడుట పారాఁడుటయు నిలఁ ♦ బడుట నేర్చి

దిన దినంబునుఁ బెరిఁగెడు ♦ తెఱఁగుఁ గాంచి
కలికితన మందె నొక్కింత ♦ కన్నెమిన్న ॥

తే॥ ఆట లాడుచు వచ్చిన • యల్లపిల్ల
దానిఁ గని ముద్దుఁగొని వాఁడు ♦ తద్దముఱియుఁ
దైఱవ వ్రతయుక్తి జ్ఞప్తికిఁ ♦ దెచ్చె నేనిఁ
బోవిడిచి మోమెటో త్రిప్పి ♦ మూతిముడుఁచు ॥

కం॥ విరసుఁ డగునతని నెమ్మదిఁ
బరుసఁ దనం బెనసి సత్య ♦ పరదేవ పరా
త్పర నారాయణ ముఖములు
సురుచిర శబ్దములు కర్ణ ♦ శూలములయ్యెఁ ॥

శా॥ ఆ లీలావతి యూహ సేసి యొకనాఁ ♦ డాత్మన్విత్కరిం
చెని । శ్లేలుబ్ధుండనరాదు కాని పతి యూ♦హీనప్రమం
బూనె నా । కాలాత్ముండగు సత్యదేవువ్రతమూ ♦ కా
మప్రదంబన్న ప । ల్కాలోచింపఁగ రాని దేమగునో
యే ♦ హైన్యంబు రానున్నదో? ॥

కం॥ మనమాత్ర దెలివిలేదే
యనిమిషులకు మొక్కినంత ♦ నదినమకూర్చెఁ
మనసువిధ మరసి మున్నుగఁ
దనయ నొసఁగె నొక్క చేయి ♦ దాచికొనిబలే ॥

తే॥ అపుడ వ్రతమొనరించు భా ♦ గ్యంబుకలిగి
నట్లయినఁ గాదొ యిదియ ♦ వం ♦ శాంకురంబు
మించి పోయినదే యిప్డు ♦ మేలుకాంచి
భక్తిఁ బూజించి యదియునుఁ • బడయరాదె ॥

మ॥ ఇదె యుద్వాహముకూడ డగ్గటియెనె ♦ ప్లెఁ బట్టిపాలా
ర్చియా । యదనుం దప్పఁగనీక చేయవలె స ♦ త్యస్వా
మియారాధనం । బెదియుం దైవ విలాసమేకద యటం ♦
చిట్లింతి చింతించి యా । సుదతీరత్నము తొందరించెఁ
బ్రియున ♦ చ్చోటన్ వివాహార్థమై ॥

చ॥ మురియుచు నాతఁడుం దనకు ♦ ముఖ్యుడు మంత్రియుఁ
గూర్చువాఁడు ధీ । వరు డఖిలాగమార్థనుల ♦ భ ప్రతి
భుండగు వానినొక్కనిం । గరము బహూకరించి యొ
స ♦ కంబెసఁగం దనపూన్కిఁజెప్పి సుం । దరుఁడగు వైశ్య
పుత్రు ధన ♦ దప్రతిముం దొడితెమ్ము నావుడున్ ॥

ఉ॥ వాఁడును దేశదేశముల ♦ వావిరిఁద్రిమ్మరి యచ్చటచ్చట
న్వాడుకఁ గన్నవారి గరు ♦ వంబున మెచ్చక పోయి పో
యి కా । రాడి కరంబుఁ గాంచనపు ♦ రంబున నింబున డం
బొనర్చునే । వాఁడను రోచనుండనఁగ ♦ వానిఁ గనుం
గొని మెచ్చి యిట్లనున్ ॥

కం॥ శ్రీవర్ధన నామంబున
భావిదితుండైనవాఁ డ ♦ పూర్వరమాసం
భావితుఁడు వైశ్య రత్నమ
నావిలమతి రత్నపురము ♦ నందు వసించున్ ॥

చ॥ అతనికి దైవయోగమున ♦ నాత్మజ యొక్కతె సంభవిం
చె నా । సతికెనఁ గానమొందునల ♦ చంద్రునియందుఁ గ
లంకమెంచి త । త్సుతుఁడు బుధుండె మైననొక ♦ దూరు

మెయి న్నిరసించి దానిస | మ్మతిఁదగువానిఁ గూర్చుమది
మంత్రివరుండగు నన్నుఁబంచినక ॥

ఆ॥ వె॥ విసివినాఁడ నేను ♦ విశ్రుతవరునకై
దేశదేశములనుఁ ♦ దిరిగి తిరిగి
భాగ్యగరిమఁజూడఁ ♦ బడసితి నీనాఁడు
నాదునిడుమఁ గెడపు • నరుని నిన్ను ॥

శా॥ నీపుత్రుండగు రోచమానుఁడు గుణా♦నీకంబునం బెద్ద వి
ద్యాపారంగతుఁ డిందుసుందరుఁడు వై ♦ శ్యాగ్రిమణీ?
యోగ్యుఁ డా | రూపోద్దీపితయా కలావతకిఁ జే♦రుం బెం
పుఁ గన్నట్టి మీా |రీ పజ్జందగు వియ్యమంద బళిరే? ♦ యి
ట్లౌనె సంబంధముల్ ॥

ఆ॥ వె॥ కొడుకు వెంటఁ గొనుచుఁ ♦ గూర్చువారల తోడఁ
దరలి రమ్ము వేగ ♦ ధనదతులిత
యనుచు నతనిచేఁద ♦ థా స్తనిపించివాఁ
డతనిపటముఁ గొని ర ♦ యాన వెడలె ॥

కం॥ తగుమాదిదిఁ దనయేలిక
యగువానికిఁ జెప్పెనెల్ల ♦ యంశము నతఁడు
న్నగువయు నగుకర్జంబునఁ
దగవు మెయిన్మెలఁగి రున్న ♦ తంబగు నెలమిక ॥

ఆ॥ వె॥ ఇంతలోన వచ్చి ♦ రెల్లబాంధవులును
వీధు లిండ్లుమేలి • విడుదలలును
వడిఁబరిష్కరింపఁ ♦ బడియె వార్తాహారుం
డొకఁడు వారిధారి ♦ నొలసి తెలిపె॥

శా॥ ఆసాధుప్రవరుం డతంద్రుఁడయి వా ♦ ద్యశ్రేణి మ్రోయంగవి|
ద్యాసంపన్నులు మున్నుగాఁ బరిజనం ♦ బంతంత రాబాంధవ|
శ్రీసన్నాహముతో నెదుర్కొనియెఁ బే ♦ ర్మిన్నించునాయా
యల్లుని| న్వాసిన్మాధవుఁ జేరు పాల్కడలి స ♦ న్నాహంబు
సామ్యంబుగన్ ॥

ఉ॥ అంబుధి యంబుధిం దరిసి ♦ నట్టులతండలవారిఁ జేరియు|
క్తుంబకుకీరెఁగాంచి తను ♦ కాన్కలొసంగియునంగు గ
ల్చువా| నిం బురవీథులం జనులు నేత్రమునం గని మెచ్చు
చుండ భా| వంబెసలారఁ దోడుకొని ♦ వచ్చి వడి న్విడి
యించె నొక్కచోన్ ॥

వైశ్య కన్యక వివాహము.

కం॥ అంతట నాతండర్చి
ష్యంతుఁడు తత్సాక్షిగా స ♦ మంత్రకముగ శ్రీ
మంతుఁ నకున్ సంగె సుత నతి
కాంతన్ జామిత్రశుద్ధి ♦ కల లగ్నమునన్ ॥

ఆ॥ వె॥ విధి విధానమునకు ♦ వెలితి లేకుండు న
ట్లాచరించె నదియు ♦ నప్పురోధ
యదియుఁగవికి వర్ణ్య ♦ మగునైన నెఱుఁగని
వారుకలరె యరయు ♦ వారుకలరె॥

సీ॥ కలిమికి నీడైన ♦ కలిమి సంపాదించె
దివుటమై నవయంత్ర ♦ దీపతతులు
వినుమాత్ర నోరూరు ♦ విధమునఁ జేయించెఁ
బలు తెఱంగుల మేలి ♦ వంటకములు

సమకూర్చె నెడనెడ ♦ గమ గమించెడు సపా
నీయఫలాహార • నిచయములును
పసలీనువలపుల ♦ దెసలాక్రమించెడు
పోడిమినొప్పించె ♦ పీడియములు

తే॥ సీవితులు పూలదండలు ♦ చేరుమాళ్ళు
నగరుగందము మైపూత • లత్తరువులుఁ
గప్పురపుఁ బూసలొసఁగె వా ♦ డొప్పులొలుకు
మేజువానీలలో బంధు ♦ మిత్ర తతికి॥

తే॥ ఎన్నికలు మున్నుగాపేర్లు • కొన్నివ్రాసి
స్వపురమునఁబెద్ద తలగల ♦ వారికెల్ల
నిల్లువరుసనఁ దము నాశ్ర ♦ యింతురనుచుఁ
దృఢములగుధోవతుల చాపు ♦ లిచ్చిరపుడు॥

మ॥ కలవార్పండిలిఁజేయుచుండిరని స ♦ త్కారంబు సేకూరు
నం। చెలమి న్వచ్చినపండితోత్తములఁ బ్ర ♦ త్యేకంబ గో
ష్ఠంబు లో। వలిభాగంబునఁజేర్చి పేర్చివిభవ ♦ వ్యాపార
మేపారనొం। దిలివోనిల్చిరి నల్వురైదుగురు ద్వా • ద్దేశం
బునం బొందికన్॥

తే॥ ఒకరికిద్దఱుగౌరవ ♦ మొప్పవారి
నొక్కొకరిఁబిల్చి ద్వారంబు ♦ నొద్దనిల్పి
చేతిలోనేదియోకాని • చేర్చిముడిచి
గుప్తముగ మ్రొక్కి పనిచిరా • కోవిదులను॥

సీ॥ నూటపదార్లిచ్చి ♦ నాటుమేళంబొండు
వేయియునదియిచ్చి ♦ పెద్దమేళ

మాగత మటియిచ్చి ♦ బోగముమేళంబు
వేలితి పోనిచ్చి ♦ చేండుమేళ
మికపదివేలిచ్చి ♦ మెసగుమాంతులు గుండ్లు
కనక మిచ్చియు నవిఁ ♦ గాల్చువారిఁ
బొరిఁగొన్ని వేలిచ్చి ♦ పూలపాలకులు వ
రాలిచ్చి యాట్లగు ♦ ట్రాలబార్ల

తే॥ సంతరించి సహస్రాతి ♦ శాయిందీప
కలనఁబుడమియునాకసం ♦ బెలమినెనయఁ
బెండ్లిపెద్దలు సొంపుగా ♦ వెంటనడువ
నలవధూవరులూరేగి ♦ రనుదినంబు॥

కం॥ లోపములేకుండఁగ వాఁ
డీ పగిదివివాహయజ్ఞ ♦ మొలయించి సుస
ల్లాపములతోడఁ జుట్టల
కాపజ్జంగట్టనిచ్చి ♦ యనిచె న్దృప్తిన్॥

తే॥ దారిడొంకయు లేదుపో ♦ దైవమునకుఁ
గానఁగానున్న దెప్పుడుఁ ♦ గాకపోదు
మఱచెనాతఁడు పందడి ♦ మైఁ దలపఁడ
సత్యనారాయణస్వామి ♦ సద్వ్రతంబు॥

ఉ॥ అన్నిటిఁగొన్ని నాళ్ళు పన ♦ నల్లుడుఁగూతురుసర్వసౌఖ్యసం
పన్నతఁ దేజరిల్లనొక ♦ మారనుమామయువింటియల్లుడా?
వన్నెనెసంగురత్నములు ♦ వర్తకముంబొనరింప నంబుధిం
జెన్నగుసీమలం దిరుగఁ ♦ జిత్తమువోయెదునీవువచ్చెదే॥

కం॥ విను కలిమిమొసకమొసఁగ
నృనమిరుపురమేగి మేలి ♦ నగరులగరువ
మ్మునఁగనిరతనఁపు సరుల
ఘ్నన నెంతటి వృద్ధినెనయ ♦ మేకొన నగునో॥

శ్రీవర్ధనుం డల్లునితో వాణిజ్యయాత్ర కేగుట.

తే॥ గీ॥ అనుడు వల్లెయనుచు ♦ నల్లుఁడుత్తోడరా
దరుణరత్నపూరి ♦ తమ్ములైన
తరణులందు విభవ ♦ తఃపరివారంబు
చెలయఁబయనమయ్యె ♦ జలధినతఁడు॥

శా॥ శ్రీమంతుండగునల్లువాఁడు నతఁడుం ♦ జిత్తమ్ములుప్పొంగ
సు। శ్రీమీఱన్ దగుబేరమాడుచునధి ♦ శ్రీమించుతద్ద్వీ
పవ। దూర్భాముల్గాంచుచుఁబోయిపోయి విధియు ♦ న్మున్నేగు
చుండంగనా। స్తోమంబాగిరి రత్నసానుపురిఁగం ♦ దోయిు
నిరీక్షించుచున్॥

తే॥ గీ॥ అన్నమాటకుఁ దప్పిన ♦ యతనిఁజూచి
తగనికోపముఁబూని స ♦ త్యప్రభుండు
కఠినములుదారుణమ్ములౌ ♦ కష్టములితఁ
డనుభవించెడుఁగాతమం ♦ చనియె నంత॥

ఉ॥ ఆతతవప్రగోపురవ ♦ రాలులితాభ్రమనభ్రకాంతిసం
పాతముచంద్రకేతు నర ♦ పాల వినీతము మాపరీతము
ద్ద్యోతితసర్వధర్మ విని ♦ యోజిత జాతివిభేద మురర్వరా
ఖ్యాతమురత్నసానుపుర ♦ మందునొనర్చిరివారుబేరమున్॥

మ॥ ఒకనాఁడావణిజుల్నృపాలుఁగను ను ♦ద్యోగంబునం బోవఁ
బా। లకు గేహమ్మున సొమ్ముదొంగిలిభటు , ల్బాధింపరాఁ
జోరులా। సకలమ్ముచ్చుటవైచి పాఱుటయు నా ♦ సాధుద్వ
యింజూచి వా। రెకసక్కెంబులనాడి పట్టుకొనిభూ ♦ మీ
శానునింజేర్చినన్॥

ఉ॥ దొంగలఁ బట్టితెచ్చితిమి ♦ దోచినతద్ధనమెల్లఁ దోచె వీ।
రింగని శిక్ష సేయుఁడని ♦ రెక్కొనివాఁకొను తద్భటాలి వ।
ల్కుంగడునమ్మి సంకెలలుఁ ♦ గూరిచివేఁజెఱసాలలోనవై।
నంగనృపాలుఁ డానయిడె ♦ భాగ్యము యోగ్యతఁగాన
నిచ్చునే? ॥

తే॥ ఊరుజులమేము బేరమ్ముఁ , గోరి నీదు
దరికిఁజేరుచునుంటిమి ♦ తప్పెఱుఁగము
దొంగలముకాము చూడుమా ♦ హంగటంచు
పేరుపలికిరి చేతులు ♦ పిసికికొనుచు ॥

మ॥ వినిరాజన్యుఁడుమేలుమేలిదియు ను ♦ ద్యోగ్యోంపలెన్నేనిఁ
గూ। ల్చినఁజేకూరదె సాక్ష్యమేలయనుచు ♦ న్నిగ్రహంబ
యూ యోడలం। దును నెక్కొన్న తదీయ మాధనముసం♦దో
హించి శ్లాఘించుచుం। దన భాండారముతెల్లనించుకొని
యొం ♦ దైవంబ తోడ్పాటుగన్॥

రత్నపురాధిపతి శ్రీవర్ధను నల్లునితోఁగూడఁ జెరసాలలోనుంచుట.

తే॥ అంతఁగొట్టుచుఁదిట్టుచు , నధిపువారు
వారిబంధించి చెఱసాలఁ ♦ బాఱవైచి

రమరకృతులెందునాలస్య ♦ మయ్యెనేనిఁ
దెలివికలవారికిని ముప్పు దేకయున్నె॥

శా॥ ఆనాఁడద్దమరేయి రత్నపురిగే ♦ హంబందు మశ్చోరసం
తానం బీగలలాగు మూగి సకలా ♦ ర్థవ్రాతముందోచినన్
దీనత్వమ్మునఁగట్టఁబూయఁదిన న ♦ ర్థింద్రావగా లేకయు
చ్చానల్దోగిరి లచ్చిదారివరి ల ♦ క్ష్యంబౌనెయెవ్వానికిన్॥

కం॥ అతిదుఃఖిత యయి లీలా
వతి యాధివ్యాధులెగయఁ ♦ బట్టఁడుకూడే
గతిదొఁఱకనోయని తిరిగెం
బ్రతిదినముం బ్రతిగృహంబు ♦ బ్రతిహారంబున్ ॥

ఆ॥ వె॥ భుక్తభోగయయిన ♦ పొలతిసంగతికేమి
వచ్చుచున్నమేలి ♦ వయసునందు
దయితుఁబాసి యట్టి ♦ దారిద్ర్య దశఁగుందు
తన్వివిన్నఁగనులు ♦ తడువకున్నె ॥

తే॥ ఎంతయన్నముఁ దిన్నయా ♦ వంతలోన
నరిగి ప్రేవులుమాడు పే ♦ రాకలియగు
వెడలె నభిమానమును దాన ♦ వినమె తెలివి
తక్కువగువాని కాకలి ♦ తొక్కఁడనుచు ॥

తే॥ మున్ను వారిల్లు జుట్టి యె ♦ ప్పుడునుఁ దిరుగు
వారుచూడరు సరికదా ? ♦ వనిత లట్టి
వారియిండ్లకుఁ బోయినఁ ♦ బల్కరొండ్లు
బలిసి యఱచేతికిని బండ్లు ♦ వచ్చెనేమొ ॥

కం॥ కడుదిక్కఱి విధిచెయిదిం
బడతులు బడరానిపాట్లు ♦ వడిరీగతి నో
క్కఁడు తీర్పఁ గర్తయే పర
ముఁడు ననుకంపాబ్ధి యైన ♦ పురుషుఁడు దక్కన్॥

కం॥ సుత యొకదెసఁజనె నాకలి
వెతఁ దీర్పఁగఁ దల్లి మారు ♦ వీధింజని యా
వెతతీరక తిరిగి గృహ
ప్రతిహారమునేలఁ బండి ♦ పరిదేవించెన్ ॥

లీలావతి విచారపడుట

మ॥ అకటా యేమనుదాన నట్టిసిరి నూ • యంజేసి నానాథు
ని । న్నికటంబు న్వెడలించి కూతునగు వా ♦ నింబాపి నా
చేతి కి । ట్టికలం గూరిచి సిగ్గుఁబోఁగొడపి కా ♦ తిన్యం
బసంబన్న పూ । నిక నిట్టే చెడు నన్నుఁ బాపమనియే ♦ నిం
జంకవో దైవమా ॥

మ॥ ఒకసంతానము లేకలేకెటులో భా ♦ గ్యోపాధిమైఁ గ
ల్గెదా । నికినేలాదయితుండుఁ జేకురె నసం ♦ దిగ్ధంబు సౌ
ఖ్యంబుపో । య్మికయంచు న్మదిసంతసించుతఱి హా ♦ యిం
బాపి సంసారముం । జకిలీచేసిన కత్తివోలె నిలు వి ♦ చ్ఛే
దించెదే దైవమా ॥

మ॥ అకలంకంబు మనంబు నగ్గలము సి ♦ గ్గాలంబు కామంబులే
దొకమార్గంబును ముగ్ధచిత్త మెటులో • యూహింపగా
రాదుతిం । డికినై యెచ్చటవోయెనో మఱలకుం ♦ డె న్నేఁ

డయిందాకనిం । కొంకమార్పుంగలిగింప నెంచెదవోయే
మోచాలవో దైవమా ? ॥

మ॥ వికలం బద్మినిఁ జేసి యుత్పలినికా ♦ విందప్పుడే కూర్చె
దా । యకలంకుండగు భానుఁ బాపి కలనే ♦ నాంకుంబొరిం
జేర్చె దీ । రకముల్ని సహజంబులన్య లిటులో ♦ ర్వాఙ్
లేరుసయ్యాట పి । ల్లికినైన న్వ్యథ మూషికంబునకుఁ జా ♦
లిం గూర్పదే దైవమా ॥

కం॥ అనియట్టిటుగని దైవం
బునుదూఱుచు నల్లనేలఁత ♦ పున్నెముకతనన్ ॥
మునుపటి కథ నెమ్మదిహా
త్తిన నన్నియు మఱచి కొంత ♦ దిమ్మరవోయెన్ ॥

ప్రభాత వర్ణనము

చ॥ కలువలఱేఁడు దర్పణము ♦ గాఁగననయ్యెను భానుమం
తు ను । త్తలనవవైభవంబునకుఁ ♦ దారలుఁ గన్పడవ
య్యె నొక్కట । న్నలినియొనర్చు మేల్తపము ♦ నన్ఫలవై
ఖరి చూడనయ్యె నొం । దిలి తొలఁగెం దమంబెడలెఁ ♦ దేజ
ము మిన్నెన సెం గ్రమంబునన్ ॥

సీ॥ దర్పకుఁగూల్చి త ♦ త్ప్రభుమ్ముఁ గ్రమ్ము ము
క్కంటి మూడవకంటి ♦ మంటయనఁగ
నైంద్రి సంశుద్ధమై ♦ యనుసరింప శతక్ర
తుండు ప్రేల్చినయగ్ని ♦ కుండమనఁగఁ
గాలవర్తకుఁడమ్మ ♦ కమునకై తుడిచియుం
గడి నిడ్డపద్మరా ♦ గంబనంగ

ననుదినమ్మనురాశి ♦ యగుచున్న కోకాళి
యతిలోకరాగసం ♦ తతి యనంగ
తే॥ శ్రోతపథమున నడుచు వి ♦ చక్షణులయ
దృష్టములఁ బ్రకటించెడు ♦ దీపమనఁగ
దేవి చెవికమ్మ పున్నెంపు ♦ దీవివేఁడి
వెలుఁగు తూర్పున నుదయించి ♦ వొలిచెనంత ॥

ఉ॥ వచ్చిన యాకలావతని ♦ వద్దకు రమ్మని కౌగిలించియుం
బోచ్చెములేని కూర్మిఁ దను ♦ పుంగవ కత్తరలాక్షితల్లి నీ
వెచ్చటనుంటి రాత్రి గత ♦ మెయ్యది నీమనసెట్లు నేను నీ
యిచ్చకు రానొకో యనిన ♦ నింతికి వెంటనె కూతురి
ట్లనున్ ॥

శా॥ అమ్మా? దోసములేదు నావలన వి ♦ ప్రాగ్రేసరుం డొ
క్కఁడ । గ్యమ్మానొక్క వ్రతమ్మొనర్చె నది ♦ రమ్యమ్మ
య్యె నచ్చోటనే । న మ్మాహాత్మ్యము వింటిఁ దీక్ష నఖి
లా ♦ యాసమ్ము లద్దేవుతీ । ర్థమ్ముం ద్రావి ప్రసాదముం
దిని కృతా ♦ ర్థత్వంబుఁ బ్రాపించితిన్ ॥

తే॥ అఖిలకామంబు లొనఁగూర్చు ♦ నావ్రతంబు
సత్యనారాయణుండు ప్ర ♦ శస్యుఁ డందు
విచ్చిపోవక మనవారు ♦ వచ్చిరేని
మనముచేయుద మావ్రతమని ♦ యనుటయు॥

తే॥ ఈవ్రతంబెనుమీ తల్లి? ♦ యింతసేసెఁ
జేయవలసిన దేశాని ♦ చేయువార

మనుచుఁబల్కఁగరాదని ♦ యాంధినుండి
సుతకుఁ ద దుదంతముందెల్పి♦ శోభనాంగి॥

లీలావతి సత్యనారాయణ వ్రతము నాచరించుట.

ఉ॥ శక్తికి యుక్తమౌనటుల ♦ సత్పదఁదద్వ్రతమంచుబూని
యా రక్తవిశాలలోచన పు ♦ రమ్మునఁద్రిమ్మరితద్ధనంబుచే
భక్తికిమెచ్చుసత్యవిభు ♦ భాసురరూపముఁ బూజసేసి దీ
నోక్తులతోనదోయిలిము♦హుర్ముమనక్రియలొప్పచుండఁగ॥

తే॥ ఆలకింపుమ? యీాదీను ♦ రాలిగాఁడవ
నల్లుఁడును నాథుఁడింటికి ♦ నరుగుదేరు
నటులొనర్పుము సత్యనా ♦ రాయణాఖ్య
దేవయని ప్రార్థనమొనర్చెఁ ♦ దీవబోఁడి ॥

తే॥ అల్లుఁడును నాథుడుం జేసి ♦ నట్టిగొప్ప
తప్పుసైరింపుమని తన్నుఁ దలచిమ్రొక్కు
దానిభక్తికిమెచ్చె స ♦ త్యప్రధానుఁ
డీశునకునేమికావలె ♦ నింతకన్న॥

సూర్యాస్తమయ వర్ణనము.

తే॥ కర్మసాక్షియు నంత స్వ ♦ కార్యపరత
వారుణిఁ దలంచి యొకయింత ♦ వ్రాలజొచ్చె
నెసకమెసఁగంగఁబ్రాచికి ♦ నింపొసఁగుచు
రాజుపయనమొనర్చు న ♦ బ్రంబుఁ దోచె॥

ఉ॥ ఆరజనీవిటుండనెడు ♦ నభ్రపురాపలకం గడంగిసిం
గారమువోసి నూరియుల♦కాముఁడుపూవుల ముల్కులెల్లని

స్సారవు విప్రయోగిజన ♦ సంహారణంబున మెచ్చగించెనా
శారదరాత్రులంగడువి ♦ శారదులుం దనునాదరింపఁగన్॥

తే॥ అంతఁ గాదంబరీరస ♦ మాని రతిర
హస్య మామూలముంజూచి హర్మ్యమందు
వైజయంతీవిలాసంబు ♦ వఱలఁగాము
ది న్సుఖంబుగ జనము ని ♦ ద్రించుచుండె॥

సీ॥ ఉరమునశ్రీదేవి ♦ నుయ్యాల లూగించు
వరకౌస్తుభప్రభా ♦ పటలమెుగువ
బొడ్డునఁబరమేష్ఠిఁ ♦ బుట్టించునెఱిగన్న
తమ్మివాచవి తేనెఁ ♦ గ్రుమ్మరింపఁ
గరచతుష్టయి ముజ్జ ♦ గముల కీడెడలించు
శంఖచక్రగదాసి ♦ సమితి వెలయ
మెుగమునసర్వమ్ము ♦ మోహనమ్మెులయించు
కమ్మకస్తురి బొట్టు ♦ కలుములీన

తే॥ సత్యనారాయణస్వామి ♦ సాగిపోయి
రత్నసానుపురమ్ము హ ♦ ర్మ్యమ్ములోన
సౌఖ్యముగ నిద్రవోయెడు ♦ చంద్రకేతు
జనపతికి స్వప్నమందు సా ♦ క్షాత్కరించె॥

కం॥ ఆతండాస్వప్నంబున
నాతతవిధి సంప్రయుక్తి ♦ నర్చనలిడఁగాఁ
జేతము సంతోసిల్లన
నాతంకత బల్కుకు నామ ♦ హాత్ముఁడతనితోన్॥

శా॥ రాజానీచెఱసాలలోవణిజుల ♦ న్రావించిమేలెంచి య
వ్వ్యాజప్రక్రియఁదద్ధనంబొసఁగి సం ♦ భావింపుమా? లేనిచో
భూజానిత్వముఁ బుత్రపౌత్రతతులో ♦ బోకార్చినిన్నోర్చినా
తేజంబందువెలుంగఁజేసెదఁగుబు ♦ ద్ధింబోకుమీపెంపలర్॥

తే॥ వారుదొంగలుకారు నా ♦ వలనఁదప్పు
సేయ నామాయనిట్టిది ♦ చేసినాఁడ
దయకలిగెనిప్డు విడకున్న ♦ తథ్యమీవు
నిట్టివాఁడవయగుదు మ ♦ హీశ? యనిన॥

శా॥ దేవా! నీతల పేగతిందవిలెనా ♦ తీరొప్పఁగావించె ద
న్నీవాత్సల్యమునింపుమెప్పడెడఁద ♦ న్నీభక్తులోమాపయిర్
శ్రీవిస్తారకరా? యటంచుఁబొగడ ♦ న్శ్రీనాథుఁడంతర్హితుం
డైవేవోవఁనృపాలు డింపెనసె న ♦ ట్లానందసాంద్రస్థితిన్॥

కం॥ శ్రీమద్వాల్మీకాఖ్యమ
హోమానివరిష్ఠవాగ్ర ♦ మాలంకారో
ద్దామ గుణధామభక్తజ
నామరభూజాయమాన ♦ హరిసమ్మానా? ॥

తోటకము॥ నిరవద్యనరేశ్వర ♦ నీతిధురం
ధరధర్మమతీ? వర ♦ దానరతీ?
పరిపాలితరామ నృ ♦ పాలవచః
పరమాదర సంభృత ♦ భవ్యకృతీ॥

గ ద్య

ఇది శ్రీమదుమామహేశ్వర చరణనళిన నిత్యసేవాసమాసాదితా
నవద్య కవితా యోగహృద్య మహితాత్రేయ గోత్రపవిత్ర
హనుమత్సుధీతనయ విదితదయ లక్ష్మ్యంబా
గర్భశుక్తి ముక్తాఫలాయమాన వేంకట కవీం
ద్రాత్మ జత్వా నూన హనుమాంబాశమీ
గర్భ హావిర్భు జాయ మాన
రాఘవనారాయణా భిధాన
ప్ర ణీ త ం బై న
శ్రీసత్యనారాయణ వ్రతమాహాత్మ్యమునందుఁ
ద్వితీయాశ్వాసము.

---

# సత్యనారాయణ వ్రతమాహాత్మ్యము.

## తృతీయాశ్వాసము.



క॥ శ్రీపిట్లవానిపాలెపు
రీపరిసర రాజకస్థి ♦ రీకృతరఘురా
మోపాంత సీతమాంబా
వ్యాపారిత నిజనివేశ? ♦ హనుమదధీశా ?

ఆ॥ వె॥ అవధరింపుమయ్య ♦ యామీఁది వృత్తాంత
మనఘ? ఘనపురాణ ♦ మైనయట్టి
స్కాందమందు నవర ♦ సమగు రేవాఖండ
మందు వర్ణితమగు ♦ నల క్రమమున ॥

చం॥ కలలకుఁ బెన్నిధానము వి ♦ కాసముకై రవిణీ ముఖాం
బుజం | బులకుఁ జకోరి కింపెసఁగు ♦ బువ్వుసుధాకరుఁ
డైన రాజు వె | న్నెలనగు మోముతో వరుణ ♦ లీఢది
శాంగనఁ గోరి చేరుచోఁ | గలకల నవ్వె నైంద్రి పత ♦
గ ప్రకర ప్రకృతారవార్భటిన్ ॥

చం॥ అపుడినుఁ డల్లనల్లవిధి ♦ యానతినాదలఁ దాల్చి బద్ధ ప
ద్మపుట కవాటముల్కిరణ ♦ మాలలబీగములెల్లఁబుచ్చియు
చ్చఁపుఁ దెలివి న్వడిందెఱచి ♦ షట్పదపాళి విముక్తిఁ
గూర్చె న | ట్లపగత దోషులన్మనుచు ♦ నాతఁడు వర్ధిల
కుండునే మహిన్ ॥

తే॥ అత్తదినములు కడచన • నరుగుదేవె
కోడలి దినాలు చెడిపోయెఁ • గువలయములు
బెరసె నెసకమ్ముఁ గమలమ్ముఁ • వెరవకాక
సిరియు సౌఖ్యమ్ము నొకరుని • చేతిసొమ్మొ॥

తే॥ కలిగినప్పుడ కలిగెనే • కలిమి యొకని
కబ్బు భాగ్యమ్ము వశమున • నర్థునకది
కొందఱిలఁ జిక్కివోవనొ • కొండుబలియుఁ
గలయదియు మార్చుఁగాక తేఁ • గలఁడె విధియు॥

రత్నపురాధిపతి వైశ్యులను చెరసాలనుండి విడిపించుట.

మ॥ కృతకృత్యుండగు చంద్రకేతువిభుఁ డ • ర్థింబోయి ధర్మా
సనం । బతి మోదంబున నాదరించి తన భృ • త్యశ్రేణి
రావించి యు । న్నతమౌ గౌరవ మొప్పఁ గోమటుల బ •
న్ధాల న్వడిందెండు త । ద్గత బంధమ్ముల నూడ్చియంచు
సెలవీఁ • గాఁ దెచ్చిరవ్వారలన్॥

కం॥ ఇంకేమిసెలవొ యనుచుం
జంకు నెడఁద వడఁకుచున్న • సజ్జనవరులం
గొంకకుఁ డెడలెనుమీ యా
తంకములని బుజ్జగించె • ధరణీధవుఁడున్॥

తే॥ తనయనుజ్ఞన వారు భ • ద్రాకరణము
మంగళస్నానవిధిఁ దీర్చ • క్ష్మావిభుండుఁ
గట్టనిచ్చి నిశోదంత • కలనఁ దేర్చి
పాన భోజనములఁ దృప్తి • పఱిచి పిదప॥

కం॥ తనకొన్నవారి మణులుం
గనకము వాఁడంతకంత • గా నొసఁగి దేసం
జన నానతీయఁ బ్రదికితి
మని యోడలఁద్రిప్పి వార • లటు వోయెడుచోన్ ॥

వైశ్యులకు సత్యనారాయణస్వామి యతిరూపమున దర్శనమిచ్చుట.

సీ॥ మేలిమిబంగారు • మెలపుతీవలు వాటి
నట్లున్న పెంజడ • లెట్లొ చుట్టి
నీలఁపురా కల్మిఁ • గెలిసేసెడు మేన
మెయిగొని వెలిబూది • మెత్తువెట్టి
నెలకందుఁ బోకార్చు • నల ఫాలమునఁ జంద
నమ్మున నూర్ధ్వపుం • డ్రమ్ము వెట్టి
కడలాక్రమించు నె • న్నడుము పోడిమిమీఱ
లీలమైఁ గావిశా • టీల గట్టి
తే॥ దండముఁ గమండలమ్ము దో • ర్దండయుగళిఁ
బూనితోడిగిన పావలు • మ్రోయుచుండ
రివ్వురివ్వునఁ బరతెంచి • నవ్వుమోము
వాసిఁగన నోడదరిసె స • న్న్యాసియొకఁడు॥

వైశ్యులు సన్న్యాసిరూపముననున్న స్వామిని నలక్ష్యము సేయుట.

కం॥ అల్లోకవంద్యుఁ గనుఁగొని
యల్లుఁడు మాయను నవ్వ • లాడుచు దండీ ?
యిల్లెక్కడ యూరెయ్యది
పిల్లలునీకెంద ఱదియు • వినుచుమనుటయున్॥

తే॥ అమ్మహాత్ముఁడు నవ్వి యి • య్యావి కలిగిన
నేనుమీతోడివాఁడన ♦ కానొ యనిన
గడ్డమును మీసలుంబెచ్చు ♦ గలవటంచు
వారు పకపకనగిరి యు ♦ ప్పరమువగుల॥

కం॥ దానికిఁగోపము వోరయక
తానిట్లను యోగివరుఁడు ♦ ధనివరులారా?
మేనుకడుబడలె నడువం
గానేర నొకింతచోటు ♦ కలమునఁగలదే?॥

ఆ॥ వె॥ అనిననోడలోన ♦ నవి యివి కల వవ
కాశమన్నమాట ♦ కానరాదు
వెడలుమన్నవారి ♦ విధమెల్లఁగని యోగి
తెలుపుఁడేమియేమి ♦ కలదొయనిన॥

చం॥ కవకవ లాడిపైశ్యకుల ♦ కల్పకులిట్లని రల్లదాళ
జెవులుహరింపనెంచితివా ♦ శీఘ్రముపొమ్మటు సేయవచ్చు
నె। ట్లివి యొకవేసముత్తెలియ • వే? మముబోంట్లకు మూ
టలేలనీ। యవసరమేమియిట్టివిన ♦ యంబతి ధూర్తులరూ
పమేకదా?॥

తే॥ ఐనఁజెప్పెదమిదె విను • మయ్య తీవ
లాకులుం బూవులుం బోట్లు ♦ గాకి యాక
లద్దపుంబెంకులుంగల • వనుచువానిఁ
జప్పటులుకొట్టియొకగేలి ♦ సలిపిరంత॥

కపటసన్యాసి వైశ్యులను శపించుట.

తే॥ అట్టులేయగుగాత? మీా ♦ యవకతవక
మాటలేటికి బొమ్మని ♦ మౌనివరుఁడు
వడివడిగఁబోవఁజొచ్చె న ♦ ప్పడవఁగడచి
యల్లమున్నీటి తీరంబు ననుసరించి॥

తే॥ గవ్వఁకునుమాటుఁకుండ ని ♦ క్కపటయోగి
వరుని విదలించి ♦ సంతసపడిరివారు
ధనమదాంధులకియ్యవి ♦ తగని పనులు
కావుకావర మెద్దానిఁ ♦ గాననీదు॥

తే॥ ఇంతలోపలఁ గడుసడ ♦ గెడలిపడవ
తేలిపోయినఁ దలుపులు ♦ తెటిచివారు
జూడ మునుతారు చెప్పిన ♦ సొమ్ములుండె
మంచిచెడుఁగులు ఫలమీాక ♦ మానునోయి॥

కం॥ అంతంజదికిలఁ బడి లో
కాంతరముం బొందినట్టు ♦ లఖిలాంతరముం
ధ్వాంతమ్ము గ్రమ్మినటులీ
యంతయు లయమైన రీతి ♦ నాతురపడియెన్॥

ఉ॥ ఆయెడఁజేరి యీావచ్చిన ♦ ట్లుఁచె న్మది దాల్మిలేమిన
య్యో యిటుసేయునే విధి మ ♦ హాగ్రతఁ బొట్టయుగట్టి
నిచ్చలుం।, గాయము సౌఖ్యముం గనక ♦ కాటియకోర్చి
గడించినట్టి నా । యీాయఖిలార్థము న్మునిఁగె ♦ నిప్పుడో
కప్పుడిఁకేమి సేయుదున్॥

ఆ॥ వె॥ మందలింప వలయు ♦ మాపురోహితునిప్పు
డిట్టిపాదులగ్న ♦ మెట్లు వెట్టె
నడిగితనుట చేత ♦ నగునట్టివారలీ
పాపకర్మములకుఁ ♦ బాలువడరు ॥

ఉ॥ ఆతనిమాఱునేలయడి ♦ యాసలఁ ద్రిమ్మరెఁ గానియొక్క
నా । డీతులసీదలం బనుచు ♦ నిచ్చితినే యలపెండ్లినాఁడు
నీ । యాతురభావమేల యిది ♦ యంతయుఁ దీఱినవిత్తు
నన్నుఁ బో । డా? తఱివోయినం బిలిచి ♦ యక్కట కాని
యు నిచ్చియుండనే ॥

తే॥ ధర్మపథమన్నఁ జిత్తమ్ము ♦ తవులదెపుడు
దండుగకుఁ బాఱుఁ దానివి । ధంబ యదియు
సుఖసుఖంబునఁ గూర్చుండి ♦ సుజను నతనిఁ
బరిహాసించుట యేల? యీ ♦ బాధలేల? ॥

తే॥ కలిమికూర్చినమద మిది ♦ కాక యరిగి
పోవునే వాఁడు గూర్చున్న ♦ నావయెల్ల
తెలివితక్కువ కలిగినఁ ♦ దిట్టరాదె
యిట్లు సేయంగ వలయునే ♦ యింతలోన॥

శ్రీవర్ధనుడు శోకించుట.

చం॥ అనిపొరలాడుఁ గ్రిందవడు ♦ నక్కట దైవమయంచువ
ల్కుని । మ్మౌనయుదునో యనుం ధనము ♦ లీగతి వోవఁగ
నేమనంబుతోఁ । జనిమొద నాలుఁ బిడ్డల న ♦ సంశయవృత్తిఁ
గనంగ నేర్తునే? । యనుమెయిమూర్ఛవోవుఁదన ♦ యల్లుఁ
డుతేర్పఁగ దేఱునెట్టునన్ ॥

ఆ॥ వా॥ అంతఁగొంతతత్తఱికి ♦ నల్లుఁడుఁదానొక్క-
యూహసేసి వాని ♦ యొద్దకరిగి
చరణ సరసిజముల ♦ సాగిలపడిమ్రొక్కి-
భక్తివినయయుక్తి ♦ బలికిరిట్లు॥

క॥ కపటోపాయులు చోరులు
విపరీతఁపు వృత్తమూని ♦ వీక్షింతురటం
చపహాస మొనర్చితిమా
యపరాధము సైపవలయు ♦ నవ్యాజదయా? ॥

మ॥ అనినన్నావిప్ర మహానుభావుఁడతఁడ♦ర్యాగ్రామణీ? నిన్నెఱుం
గనె సంతానము కల్గినవ్రతము సం♦కల్పింతునంచాడి బొం
కినవాని న్నొనుమింతసేసె నది శో ♦ కింపంగ నేమాయె నీ
ధనముల్కాల్పనెమూర్ఖ?సంపదదురం♦తంబౌఁగదే?లోభికిన్॥

తే॥ అనుభవింపుము దుఃఖంబు ♦ లనుపదంబు
ననుచు నంతర్హితుండయి ♦ నంత సాధు
వతుఁడు నేలపయింబడి ♦ వనరివనరి
తెలివియించుకఁ గని వానిఁ ♦ దలచె నిట్లు॥

వైశ్యుడు సత్యస్వామిని స్తుతించుట.

సీ॥ ఎద్దానిసామర్థ్య ♦ మెలయించెమును మున్న
మూడింటమూడవు ♦ మోటికల్గి
నెద్దాని విలసనం ♦ బద్దిరా యనిపించెఁ
జైతన్యమెఱుఁగని ♦ స్థాణువులను
నెద్దానికల గూర్చె ♦ నిరువదినాల్గు కం
ఖము లేదు భూమిక ♦ లమరు మేడ

లెద్దాని విజ్ఞాన ♦ మింద్రాదిసురలని
స్తంద్రతఁద్రిప్పసం ♦ సారమందు
తే॥ దేనిగెలువంగరాకయు ♦ దీప్తచిత్తు
లాశ్రయింతురు దయఁగోరి ♦ యనుకలంబు
అజయునేకయుననఁనొప్పు ♦ నట్టినీదు
మాయను మొఱంగవచ్చునే? ♦ మావిధేయ॥

ఉ॥ మూఢుఁడమున్నయిప్పుపరి ♦ మోహితుఁడ న్భవదీయమా
యచే। గూఢతరుండవైననిను ♦ గుర్తెఱుఁగంగలనెట్లు నా
థ? నీ। బాఢదయానుషంగమునఁ ♦ బ్రాక్తనసంపదఁగూ
ర్పుమయ్యని। ర్వ్యాఢమనోరథున్నిను వి♦ భున్విభవాను
సృతిన్భజించెదన్॥

కం॥ నాధనమంతయు నీఁగదె
నాథా? నినుఁబూజసేతు ♦ నమ్ముమిఁక ననుం
బాధలపెట్టకు మల యప
రాధములసహింపు మింది ♦ రాధవ యనుచున్॥

స్వామి వైశ్యుని ననుగ్రహించుట.

తే॥ సాగిమ్రొక్కిన నాకాశ ♦ సరణియందుఁ
బల్కెవీతెంచె నినునమ్మ ♦ వలనుపడదు
వ్రతమొనర్చితివేని నీ ♦ వాంఛితమ్ము
సఫలమగుఁబొమ్ము బొంకులు ♦ సాగవనుచు॥

కం॥ దానికి సంతస మొనయుచుఁ
దానల్లునితోడఁబడవ ♦ దరి వేడుకమైఁ

బూనిక నొనరించె సత్యే
శానునిపూజనము విప్ర ♦ జనము నుతింపన్॥

ఉ॥ అంచితులంతనోడపయి ♦ నాసకలార్థములట్లచూచిమే
లెంచుచుఁజింతఁబాసితరి ♦ నిమ్మునకున్ముఖమైనదారి ప
ట్టించికడున్వడింబఱపుఁ ♦ డీ యనిభృత్యులకానతిచ్చి ని
ర్మించిన తల్పభాగముల ♦ మెట్టిరిసౌఖ్యరసానుసారులై॥

తే॥ సత్యదేవునిదయకల్మి ♦ సఫలమయ్యె
వాంఛితంబని నిద్రావి ♦ వశతనొందె
మామ జామాతయుదిలేమి ♦ మనసునిండఁ
గోర్కులూరంగ దలపోత ♦ కునుఁ గడంగె॥

విరహ వేదనము.

ఉ॥ ఇమ్మెయిఁగమ్మతెమ్మెరల ♦ యింపునకుంగడుఁగూర్చిసు
ప్రసా। దమ్ముజగమ్మునోమ సుధ ♦ దార్చెడు నీవిధుమూ
ర్తిఁగాంచిమో। దమ్మునఁబొంగెడుం జలని ♦ ధానమునామ
నమొందుమాత్ర మిట్లుమ్మలికమ్మునం బొగులు ♦ చున్నది
యేమనువాఁడనక్కటా? ॥

సీ॥ నెఱిఁబారునక్కురు ♦ ల్నిచితేంద్రనీలము
లక్కటయుగిపద్మరా ♦ గములకోన
ముత్తియమ్ములచాలు ♦ మొనగలరదనాలు
చెక్కిలినెలరాల ♦ బీటకమ్ము
పసిఁగొన్నపచ్చరా ♦ బంతులుపాలిండ్లు
వలపించువాతెఱ ♦ పచ్చిపగడ

మఖిలావయవములా ♦ యానవరత్న ము
ల్కమనీయమొడలుబం ♦ గరు కొటారు

తే॥ శ్రీకరంబట్టి సంపద చౌకసేసి
పాడుబేహారమనివచ్చి ♦ పాట్లువడితి
నకట యీరాత్రియంబుధి ♦ యట్లపెరిగె
నంతముంగాంతునో రెంటి ♦ యలజడుల్లకు॥

సీ॥ చిన్నారి పొన్నారి • చెలిమోము దరినున్న
నెలయందు నెరసులు • నెమకరాదె
చెన్నారు నన్నాతి ♦ చిర్నగ వెనపిన
వలిపె వెన్నెలలపై ♦ వలపులున్నె
చల్లార్చు నిల్లాలి ♦ స్పర్శమ్ము కలిగిన
నెరపూను చలిగాలి ♦ నేలవచ్చు
జాణైన సూనాంగి ♦ సాహ్యమ్ముఁ జెనపిన
నెడవిల్తు నమ్ముల • విలువ వలదె

తే॥ చిలుక పలుకుల నూటించు • చెలువ పలుకు
కులుకు కెలఁకున బలిగూర్ప ♦ వలనుతేద
బెరయు భాగ్యంబుఁ బోనాడి • బేరమనుచు
వీరిబారికిలోనైతి ♦ బేలనైతి ॥

మ॥ తరుణీ? బేరము సేయఁబో దలఁతుఁ జి త్తంబందునే
మందుపీ। వరుడా వస్తువుఁగోరు మేదయిన నీ ♦ కైతె
త్తునంచన్న మో। మఱమైకొండొక సోయగంబెనయ న ♦
వాజ్యంబుగా నవ్వి భ । వ్యరసోక్తి న్మదను(గహంబడుగు
సో • భాగ్యంబు ధ్యానించెదర్ ॥

ఉ॥ ఆభరణంబులు న్మణులు ♦ నన్యపదార్థము లిచ్చు మెచ్చదే
యేభవభోగము ల్మదికి ♦ నింతగఁ జేర్చ దదేమొకాని వి
ద్యాభరితాంతరంగ యది ♦ యాన్నృతినన్నె జపించు
నెప్డు నా । శోభనగాత్రి నన్ననుచు ♦ చూపుల కోపుల
నూహఁ జేర్చెదన్ ॥

ఉ॥ ఆగుణరాశిప్రోల గడె ♦ యైనవసించిన డప్పి తీరదే?
భోగములన్న నీకనక ♦ ముత్రతనంబుల కావ యట్టిచో
నీగతలేమ? వాసికడు ♦ హీనుఁడనై సిరిపేరి లేమిన
న్నాగ నిరర్థతంబొరసి ♦ నాఁడఁగటా విధిచెయ్దమల్పవే॥

చంద్ర దూషణము

తే॥ సమయమిదెయంచు నొంచెదు ♦ విమతమూది
సర్వశక్తుల నెసకొల్పి ♦ చందమామ
కొలమువారల నిటులేచఁ ♦ గూడునొక్క
న్యాయమనలేదు వీని జ ♦ న్మంబులోన ॥

మ॥ ద్విజరాజందురు కొందఱెంకొరులు ర ♦ క్తినాత్రిజవేయం
దురా । సుజనుల్కొందఱు వైశ్యుఁడందురిఁకనీ ♦ శూద్రత్వ
మట్లుండని । మ్ముజినాప్తు ల్తురకల్మినుంగొలుతురా ♦ మో
మోటమింకెద్దియో । రజనీనాయక? సంకరుండవనుచా ♦ రం
బొండు నీకున్నదే ॥

కం॥ నీపోల్కిఁ బొడమినాఁడా
శ్రీపుత్రుఁడు చదివె నీదు ♦ చెంతన యిపుడో
నీపైమూతెడు వాఁడై
పాపమనక విప్రయోగి ♦ వధమొనరించున్॥

కం॥ మీాయిద్దఱుఁదలమిగిలెం
గాయములేకుండచల్ల ♦ గామొల్లఁగఁబైఁ
జేయిడి యుపాయముంగనఁ
జేయు న్వాయుప్రధాని ♦ సిద్ధులనేనిౕ॥
తే॥ ఒకని ననసేలగు ణవంతుఁ ♦ డొకఁడున్నె
గంపజాతరకొంప మీా ♦ గుంపులోన
నీవిచారంబునాకేల ♦ యిగురుఁబోడి
నూహఁజేర్చి సుఖంతు నం ♦ చూరకుండె॥
తే॥ అంతఁ దత్సతి రత్న పు ♦ రాంతరమున
నొకకుటీరంబునం దల్లి ♦ యొ త్తిగిల్లఁ
బ్రాణనాయకుఁడగు రోచ ♦ మాను మాన
సీయగుణు నెంచి నిద్దుర ♦ ని స్తరించి॥

మన్మథ దూషణము.

కం॥ పులుగుల పలుకుల కులుకుచు
నలితతికోల్తలకు నుల్ల ♦ మల్లలనాడం
జలిచీమచిటుక్కని నం
గల వర మెనయుచును దిట్టెఁ ♦ గాముఁదురాత్ముౕ॥
చ॥మనమున సిగ్గుల గ్గదియు ♦ మానిన నైన ఫలింప దిచ్ఛయే
మనినను వేరులాభమిటు ♦ లాపదలెయ్యవి వారికయ్యెడం
గననగు దారివట్టెనో ♦ సుఖంబనఁగల్గునె యింకనిట్టిచో
ననునలయించియేమిగతి ♦ నాకౌముఁగూర్చెదొ మీానకేతనా?॥
ఉ॥ అన్నకు వావిగానిచెలి ♦ నంటొనరించితి వాఁడు దిట్టె సం
పన్నతపోవిధాను శివుఁ ♦ బార్వతిఁ జూపివెలార్చి తాతఁడు

స్మానోన్నరించె నంత విను ♦ మానఁపుభూతమవై వి
యోగులం | బన్నముపాలు సేసెదవు ♦ మానవు నీపని
మీనకేతనా? ||

ఉ| ఏటికిమమ్ముఁబోటి నల • యించెదు శక్యమె నోరుజారిన
న్నీటకటాంకు లూదియవ ♦ నింబిలు కార్చెడు పాడుగాలి
నె| ప్పాటనోకట్టి వైచి పరి ♦ వారము నేరములొగి యీా
త్రియా| మాటను మాటుమొందయిన ♦ నమ్మాయి మేలగు
మీనకేతనా ? ||

తే|| కావలసినంత బలగమ్ము • కలదటంచు
గర్వమూనెద వదియు న ♦ క్కఱకురాద
కాల్ప దొఁకొన్న ముక్కంటి ♦ కంటి మంట
నుఱుకుమని రెల్ల రొకఁడు దో ♦ డుతికెనో క్కా ||

కం|| అనిమదను గదిమియొగి నా
తనిమామను కాంచి కాంత ♦ తల్లడిలుచుఁ ని
ట్లను ననుమానముకలదే
నినుఁదిట్టినఁ జంపివైవ ♦ నేరుతు చంద్రా ||

కం|| వినుమల్లుఁ డనుచు జేరిన
నినుగురుసతి వలపుమెయిన • నిందితు జేసె
మనదీపమనుచు ముద్దిడు
కొనఁ బోయినఁ గాల్పకున్నె ♦ కుత్సిత చంద్రా? ||

ఆ|| వె|| పోలము లాక్రమించు ♦ పోకలు నలమిత్రు
వసువు లపహరించు ♦ వర్తనమ్ము

లన్యదార రతియు ♦ నైనచేతలు నీకు
నాతతాయివగుట ♦ యబ్బురంబె ॥

మలయమారుత దూషణము

కం॥ నినుఁ దలచినదోసంబగు
ననియాతని వీడి మాల • యానిలుఁగని నో
వ్వున నవ్వి యవ్వధూమణి
యనునొఁదల యూచి స్వేద ♦ మాస్యముఁ గ్రమ్మన్ ॥

క॥ వెడమూకఁగూడి దర్పకు
నడియూరివై ఘొల్లవారి • నదలించెద విం
ద్రుఁడు సంప నపుడు చావవ
చెడిబ్రదికిన వారలిట్లు • చెనయరె పవనా? ॥

క॥ మిముదూఱుటయును దోసగగు
నమరత్వముకలిమి నింక ♦ ధ్యానించెదఁ దే
జముఁగన్న సత్యదేవుని
స్వమతముఁ బాలింప విమత ♦ వర్గ మెడల్పన్॥

సత్యనారాయణ స్తోత్రము.

మ॥ నినువేదంబులు జంకుచుం దెల్పు వమ్రా ♦ నిర్వాతమొట్లో
కనుం। గొనుశాస్త్రంబులొకింత చర్చసల్పుం ♦ గోప్యం
బు నీరూప మే। వనితంబల్కెడు ధానవే కరుణార్దై♦వారం
గమమ్మేలు ం। చనఁగానేర్చెదఁగాక పాలితసురేం ♦
ద్రా ? సత్యనారాయణా? ॥

మ॥ నినుమన్ను న్వినుతింప దూఱనగువా♦గ్విన్ధాపనం బంచుఁజె
ప్పాదనవేంబులు జాగరూకుఁడయి స ♦ ల్పుంగావ్యముం

గ ర్తయా। పునరుక్త్యాదులు లేకయుండ నిను సం ♦ బోధిం
చుచో నెద్దియుర్। గొనమేదుర్గతిఁ బాయుసత్కవి మహా♦
గూ ? సత్యనారాయణా ? ॥

శా॥ నీదాక్షిణ్యము పెంపునం బొడమినే ♦ నేయిట్టియిక్కట్టు
పా । లై దైన్యం బెనయుంగ దక్కొరులకుర్ ♦ హాస్యంబు
కాదేయిక । న్నాదైవంబునుఁ గూర్చి తండ్రి సుఖమం ♦
దంజేసి నాత్రొక్కులా । హ్లాదం బొప్పగ్రహించి వర్ధిలు
ము దే ♦ వా ? సత్యనారాయణా ? ॥

శా॥ ఆరామంబు రమామనోంబుజము క్షీ ♦ రాంభోధినట్టిల్లు
నీ । స్వారస్యంబునఁ జొక్కువారిమతులా ♦ స్థానంబు లీ
లోకసం । భారంబేలెడు నేల మాదృశులు నీ భావంబు
సేవింప వి । స్తారంబైన యదృష్ట ముండవలె శ్రీ ♦ దా ?
సత్యనారాయణా ॥

శా॥ దారిద్ర్యం బెది దోపనీదు సుఖ సం ♦ ధాతన్నిను స్వీడి ని
స్సారప్రజ్ఞుల నన్యులం బొగడనా ♦ సన్నాసు లర్థస్పృహా
న్సారస్యం బెఱుఁగంగరా దనరె నీ ♦ చారిత్ర మెట్లల్లినం
బారమ్యం బెనయింపకుండునె మహా ♦ త్మా ? సత్యనా
రాయణా ॥

మ॥ అనుచో నిద్దురవచ్చెనట్టియెడ స ♦ త్యస్వామివిప్రాకృతిం ।
జను దెంచెన్నుదతీ?శుభమ్ము మరుఁబూ♦జల్సేయుమీనన్నటం।
చను మోదించిచనె న్వధూమణి యువ♦శ్యంబద్దమేల్కాంచి
త । ల్లిని బోధించి వచించెనాయమయుఁ గొ ♦ ల్చెన్సత్య
దేవున్మదిర్ ॥

కం॥ ఆనాఁడావిధువదనలు
శ్రీనాయకుఁగొల్చుపూన్కిఁ ♦ జెలయుచునుండన్
భానుఁడనురక్తి మెయిన
మ్మానించె న్నరుణదీప్తి ♦ మహి యలరారెన్॥
చం॥ జలజము లుల్లసిల్లె నల♦జక్కవలొక్కటఁగూడెఁజీకటు
ల్పలపలనాయె విప్రుల యు♦పాసనలొప్పె సమస్తజంతు
వు। ల్తెలివిఁగనె న్సహస్రకర ♦ లీలవహించి యినుండుతో
చిన। న్నలము లొసంగుఁగాలమను ♦ భావమెఱింగి విధి
ప్రయుక్తిచేన్॥
తే॥ కాలవిజ్ఞానిబ్రహ్మాండ ♦ కర్పరంబు
సంజకెంజాయపేరిటి ♦ జ్వాలనశిఖల
వెచ్చఁదనమూదియుఁగళాయి ♦ వెట్టినటుఁగ
నల్లనల్లనఁగడలెల్లఁ ♦ దెల్లవారె॥
తే॥ తగినవిప్రులు బంధుగు ♦ ల్తారసిల్ల
సత్యనారాయణాహ్వయ ♦ స్వామి సరముఁ
బ్రతిమనావాహనమొనర్చి ♦ భక్తి యుక్తి
నా కలావతిపూజించె ♦ నట్టివేళ॥
కం॥ విత్తమురక్షించెడువాఁ
డుత్తమవిప్రుండుమంత్రి ♦ యునునగువాఁడా
బిత్తరులఁజేరి తద్వ్రత
సత్తమమిూక్షించిపలుకు ♦ సంతోషమునన్॥
సీ॥ చేరిరిమనవార ♦ లూరిచేరువకిప్డు
నన్నుఁబుత్తెంచిరి ♦ నలిన నయన?

నీవునీకూతురు ♦ నిష్ఠమైనునికికి
దేవదేవుఁడుమెచ్చఁ ♦ దీవఁబోఁడి?
విపరీతములులేక ♦ సపరివారంబుగా
నీకుసేమమెకదా? నెలతమిన్న?
మంగళాచారసం ♦ పదవేచియున్నారు
చనుదెమ్ము వేగమ ♦ చంద్రవదన?

ఆ॥ వె॥ వ్రతము పేరదేమి ♦ వాంఛితప్రదమైన
సత్యదేవు నోము ♦ సరణిదోఁచె
నమ్మహాత్ముకన్న ♦ నక్కటకలిలోన
బిలిచినపుడ పల్కుఁ ♦ వేలుపున్నె॥

మ॥ అనుపల్కు ల్వెసబానకమ్మువలె శ్రో ♦ త్రానందముం
గూర్పనె ] మ్మనమారాట మొనర్పనామహితు పం ♦ భా
వించి యాలేమపెల్చనఁబుత్రి వ్రతపూర్తికై నిలిపి యు ♦
త్సాహంబుతోఁబోయె న ] ల్లునినాథుంగనఁ గోరుకన్నుఁ
గవ ♦ యుల్లోకంబు మేలందగన్॥

ఆ॥ ఆనిదర్శనమున ♦ వాకలావతి మది
భక్తినమ్మకమ్ము ♦ ప్రబలెకాని
ప్రియునిఁగాంచుకోర్కి ♦ వెలితిపాలొనరించె
స్త్రీలచిత్తములకుఁ ♦ జీలలున్నె॥

క॥ వడివడిగాఁ దద్వ్రతముం
గడ తేర్చిలతాంగి కాంతుఁ ♦ గాంతుననుమదిం
జడనెనయుఁ దత్ప్రసాదముఁ
బుడమింబడవైచి యపుడ ♦ బుడబుడ వోయెన్॥

ఆ॥ వె॥ పరిజనమ్ముఁ గతటముఁ ♦ బ్రాపించె రతనాల
దినుసులెల్ల నేల ♦ దింపి వైచి
రింతలోన వార్ధి ♦ హేలమై నెక్కిన
యట్టి రోచమానుఁ ♦ బుట్టిమునిఁగె॥

క॥ శ్రీవర్ధనుఁ డాతురుఁడై
ధీవరులం దింపి నెమకు ♦ తీరినయించెన్
దైవకృత మేరికెఱుఁగం
గావచ్చు న్వ్యాపివియల్ల ♦ కలమరులెల్లన్॥

ఉ॥ ఒడ్డున మున్ను నే పడవ ♦ లొక్కటమున్గినఁ గాన రావె మా
కడ్డునె వారియివ్విధము ♦ నక్కట కానమ యెందుముందునీ
పడ్డపరిశ్రమంబులిటు ♦ వంటివి కావె మహాత్మ? మంచియుం
జెడ్డయు దైవికంబులెడ ♦ జేర్పుము దేవు నటంచుఁ బల్కినన్॥

ఆ॥ వె॥ ఊచ్చవడియె నతఁడుఁ ♦ జచ్చినట్టుల యుండె
నతనిసతియు భృత్యు ♦ లడలుచుండి
రల్లకన్నె మిన్న ♦ యల్లాడి యల్లాడి
పుడమిఁ దడవి పొరలి ♦ పొరలి యడలె॥

ఉ॥ ఆలలితాంగి నేలఁబడి ♦ యాతురయై దరిలేని శోకకీ
లాలనిధి న్మునింగి చద ♦ లంజను పుల్గుల పైతమేగఁగాఁ
జాలకజాలి నిల్చియువ ♦ శంబులుగాఁ దపఁ బుచ్చియేడ్చెన
చ్చోలలి వాయు పేరడవి ♦ నో ప్పెనయుంగద లోకమింతకిన్॥

ఉ॥ హా నవమోహనాంగ? గుణ ♦ హారిచరిత్రమ? మన్మనః
ప్రియా? । నేనిదె నిన్ను నమ్మితిన ♦ నిందిత నెందునుధర్మ ప

త్తిన | న్నినెటేఁ ద్రోచి పోకతగు ♦ నే? తగుఁబో? యి
టుసేత వేధకుం | దానెపుడే నెఱింగినక ♦ దా? యొరుక
ష్టము జాలిఁ గూర్చెడిన్ ॥

ఉ॥ ఎక్కడ మేనుపొంకము మ ♦ ఱెక్కడ సాధుకులానుషం
గమిం | కెక్కడ తెల్వితేటలు న ♦ హీనగుణోదయ మెట్లు
నాకునీ | దక్కుట యెట్లునాథ? యల ♦ దైవత భామలఁ
జూచివొక్కుచో | నక్కట నన్దలంతె? యడి ♦ యాసలఁ
బొంగితిఁ గ్రుంగితిందుదిన్ ॥

సీ॥ చిరునవ్వు నెలయించు ♦ సిరిఁగన్న నీమోము
చందమామకు వేయి ♦ వందనమ్ము
లరవిందములకందు ♦ నపనయించెడు నీదు
నడుగుఁ దమ్ములకు జో ♦ హార్లనూర్లు
యోపలచిత్తమ్ము ♦ లుర్వీళులూరించు
నఖిలాంగ సంపద ♦ కానతి తతు
లలనాక సదులభా ♦ గ్యమ్ముగుత్తకుఁ గొను
గుణరత్నములకింకఁ | గొన్నిజోఁత

తే॥ లర్యవరకులదీపక? ♦ ప్రాణనాథ!
కాచితానంగ సమ్మాన? ♦ రోచమాన?
యధిగమించెద నాకంబ ♦ నాకులంబు
నిన్నుబాసిన సేలపై ♦ నేస్తమేల?

ఆ॥ టు॥ ఆడుదానిపుట్టు ♦ వధమంబుదానవై
ధవ్యమన్నదుష్కృ ♦ తములపంట

కొడుకుకొమ్మలేని ♦ కోమలికింకేటి
బ్రదుకుసౌఖ్యమేమి ♦ ఫలము కలదు॥
॥ తే॥ చూడఁ గొనగవచ్చు ♦ సురలోక సుఖముల
నాత్మహత్యవలని • యఘములేదు?
నాథు ననుగమించు ♦ నాతికిసను ముని
వరులపల్కులందు • భావమసదె? ॥
కం॥ కావునఁనాథునిఁజేర్చం
గావించెద యత్నమొండు ♦ గతియుంగలదే?
భావి భావికంబు లాతని
పావలుకలవిచటననుచు • వాపోవుటయున్॥
శా॥ ఆలీలావతియట్టికూతుఁగనిమో ♦ హైయుండియున్నాథు
మో | హాలోకించియిసీ? యిదేటి వ్యసనం ♦ బస్మత్కృతం
బిట్టులీ | వేళం బండదె? యేమిసేసితిమొ? యే ♦ వేల్పేమి
కోపించెనో? | వేలంగూలు నెయోడలోభమున ను ♦ ర్వీం
గీడుచేకూరదే? ॥
ఆ॥ వె॥ అనుచుననుఁగుఁగూతు ♦ నాలింగనమొనర్చి
కురులుద్రేలనశ్రు ♦ లుగులనేడ్చి
దానశోకమెల్ల • తమమెట్టు లట్టుల
నిలమనఁగనయ్యె నెఱియకాదె? ॥
కం॥ తల్లియుబిల్లయుఁజూపఁగ
యుల్లము ఝల్లురన నేడ్చు • చున్నవిధముతా
నెల్లవిధమ్ములముంపదె
యొల్లనివారలనయే ని • నుచ్చోకమునన్ ॥

శా॥ ఆసాధుప్రవరుండు విస్మయవశ ♦ వ్యాపారుఁడై చింతచి ।
త్తాసంగంబున వంతఁగూర్చనొడల ♦ న్యాయ త్తమైనట్టులు ।
చ్ఛ్వాసంబేనియు లేకయుండి మదిసం ♦ భావించి సేవించె ని।
ట్లాసత్యేశ్వరు నాతురుండయి నమ ♦ స్యాపూర్వవాగ్వై
ఖరిన్ ॥

ఉ॥ ఎచ్చటనున్నవాఁడవో ఫ ♦ ణీంద్రశయాన? విధేయపా
పపా । టచ్చర? సత్యదేవ? వన ♦ టంబడి కుందెడు దిక్కు
లేనియీ । పిచ్చుక కింతయేల మును ♦ వేద్యము నీమహిమం
బుఁజూపి వై । యచ్చరపాళికింపుగ ద ♦ యాకర? నన్నిక
నేలరాగదే॥

సీ॥ బొడ్డుతామరలోనఁ ♦ బొడమినవిధి యిచ్చ
పుట్టించునీ రేడు ♦ భువనములను
నురమున నెలకొన్న ♦ యువిదకన్గోనచాయ
కలిగించునన్నిటఁ ♦ గలిమియెలమి
సగముతానై యున్న ♦ సైదోనిసత్వమ్ము
సర్వసంహరణంబు ♦ సంతరించు
చేఁదమ్మినలరారు ♦ జోదుకైదువు తెల్వి
పాచునిచ్చోటి యు ♦ పద్రవముల

తే॥ నన్నియునుఁ జెందునిన్ను స ♦ ర్వాంతరాత్మ?
నీదుమది కెక్కు వానికి ♦ లేదులోప
మిట్టినినువిస్మరించి యి ♦ క్కట్టువడితి
నార్తినాశన రావయ్య? ♦ యనదనైతి॥

సీ॥ మకరమ్ము నెమ్మున ♦ వెకలి యెపిలిచిన
గజరాజు నేలిన ♦ కలికితనము
తండ్రితోఁ గికురించి ♦ తనుఁగొల్వఁ బూనిన
ప్రహ్లాదునకుఁ గూర్చు ♦ పరిధవమ్ము
ఒవ్వనివార్వల్వ ♦ లొల్వదిక్కటి నేఁడు
ద్రౌపదిఁగాచిన ♦ దంఁడితనము
గురుసుతునస్త్రాగ్నిఁ దెరలిజనించిన
యభిమన్యుసుతు నోము ♦ నద్భుతంబు
తే॥ లోకవిశ్రుతములుకావె ? ♦ తేటువచెడి
నిన్ను జెందుటక్రొత్తయే ? ♦ నీరజాక్ష ?
వెనుకమాటలు తలపెట్టు ♦ వేళకాదు
సాకిసాగించుకొనవయ్య ? ♦ సత్యదేవ? ॥
ఉ॥ దబ్బరలాడువాఁడ నను ♦ తన్మతిమానుము దేవదేవ ?
యా । యబ్బునఁ గొల్వనే ? నినుమ ♦ హాత్మ్యవమొ
వ్వఁగవృత్తియుట్టిదం । చెబ్బరికంబు బూనెదవొ ♦ యా
నుడిఁదప్పితినేని విన్మునా । యబ్బకు నమ్మకుం డొలఁగి ♦
నట్టేఁడు నాదు నసంశయంబుగన్ ॥
ఆ॥ వె॥ లేకలేక వొడమె ♦ నీకొమార్తె యొకర్తు
ధవునిబాసి యదియుఁ ♦ దల్లడిల్ల
నేటిధనము జన్మ ♦ మేల? బందుగులెందు
దైవమున్నలోక ♦ తతులుగలవె? ॥
కం॥ వగపేల ? చిచ్చుఁజొచ్చిన
నాగిపంద్రము దేటియు నీద ♦ నొప్పదె ? దేవా?

పగవారి కేని వలదీ
ముగుదలు వైధవ్యమెనయు ♦ ము ప్పకటకటా ? ॥

చ॥ ధనములునోడయు న్వినుము ♦ దైవత శేఖర ? మీదుఁ
గట్టితిఁ | జనులునుతింప నా కొమిరె ♦ సంతస మందగ
రోచమానునిఁ | మనిచితివేని నీకిపుడు ♦ మావిభవంబు
న కర్తమైనపు| జనమెునరించికొని ముని • సన్నుత ము
ట్టిన చిన్నకానియుఁ ॥

కం॥ అనియాతురుఁడై ధ్యానిం
చిన విభుఁడవ్వారియందుఁ ♦ జిత్తము దవులం
ననుఁ బూజించి ప్రసాదము
దినక దినిచికొనియె నిదియు ♦ దీనత ననియెఁ ॥

ఉ॥ అంబర మధ్యభాగమున ♦ నానుడి వెల్వడినంతఁ గాంతవే
గంబటు వోయిభక్తిమెయి ♦ ఖాద్యమశేషము నారగించి
హే | మాంబర ? దేవదేవ ? నను ♦ నాపదఁ బాపుమట
చుమ్రొక్కియం | తంబరతెంచి కాంచెఁ గలి ♦ తంబగు
త్తరి రోచమానునిఁ ॥

తే॥ సంతసంబున నింతిమో ♦ ముఁతయవ్యోఁ
జిరకృశంబగు నెమ్మేను ♦ కరమువాలిచెఁ
భయముభక్తియు వినయంబుఁ ♦ బడతిమిన్న
నున్నటులెయుంచెఁగాకున్న ♦ నుర్విగాదె ? ॥

ఉ॥ అప్పుడు వైశ్యవర్యుఁడు మ ♦ హావిభవంబున కర్త
మావిధం | బొప్పగసత్యదేవుని మ ♦ హోన్నతి మెచ్చు

చు విప్రవర్యులుం । గొప్పతనంబు గల్గుతన ♦ కుంగల
బందుగులు న్నుతింపమే । నుప్పరమంతగా సలిపె ♦ నుజ్జ్వ
లమౌవ్రతరాజముందగన్॥

తే॥ అన్నికాలములవారికి ♦ నన్నదాన
మాచరించెనువేల్పులు ♦ నౌననంగ
జాగరంబొనరించెనా ♦ క్షణద క్షణద
గాఁ గనులుమూయకుండ స ♦ త్కథలువినుచు॥

తే॥ మణులుసొమ్ములు మేలియం ♦ బరములొసఁగె
తమ్మలమ్ములు హరిప్రసా ♦ దమ్ములిచ్చె
దక్షిణలటంచు మఱికొన్ని ♦ దారవోసె
బ్రాహ్మణోత్తములకుఁదృప్తిఁ ♦ బడఁడవాఁడు॥

ఆ॥ వె॥ మున్నుమాత్రమేమి ♦ యున్నదిలోపంబు
లోభమొకఁడువాని ♦ లోఁగొనెనటు
లిప్డు డదియడంగ ♦ నిద్ధతేజుండయ్యె
నున్నలోభిమేల్మి ♦ యన్ననిదియ॥

ఉ॥ అంతటనర్ఘజాతముగ్ర ♦ హంబునకుందగఁజేర్చి తుష్టిమై
నింతియుసేవసేయుసుత ♦ యొంతయుసంతసమందనల్లుఁడుం
జెంతఁజరింపసంతతివి ♦ శేష సుఖప్రదమైరహింపనా
వంతయుఁజింతలేకయున ♦ యంబుభజించెను సత్యదేవునిన్॥

కం॥ మాసమునకుఁబక్షమున క
మాసకుఁద్వాదశికిఁబున్న ♦ మకుఁజేయువ్రతం

బాసజ్జనుఁడెప్పుడుమదిఁ
బాసిచన్యదేవవిభుని ♦ భక్తి దలిపఁగ॥

ఆ॥ వె॥ ఇట్లు సేసిసేసి ♦ యింతింతయనరాని
వైభవంబుఁబ్రాభ ♦ వంబుఁబొంది
యిహాఫలంబులెల్ల ♦ నింబుగాఁబ్రాపించు
హరిభజింపఁజెడవె ♦ యఘములెల్ల॥

కం॥ ఎవఁడీవ్రతమాహాత్మ్యము
సవినయముగఁజెప్పవ్రాయుఁ ♦ జదువువినువ్రతం
బవధానబుద్ధిసేయు
న్భువివానికి లోటులేదు ♦ భుక్తిన్ముక్తిన్॥

సీ॥ సంతానమొసఁగు ని ♦ స్సంతానులకునోలి
దారిద్ర్యయుతులకు ♦ ధనములిచ్చు
బ్రహ్మచారులయోగ్య ♦ భార్యాయుతులఁజేయు
నజ్ఞులకెల్లవి ♦ ద్యలుఘటించు
రోగపీడితులకా ♦ రోగ్యంబిడును విని
ర్బద్ధులబంధంబు ♦ వలనఁబాచు
నైహికంబులమర్చు ♦ నర్థార్థులకునట్ల
మోక్షంబుకూర్చుము ♦ ముక్షువులకు

తే॥ సత్యనారాయణవ్రత ♦ సత్తమం బ
టంచు స్కాందోక్తరీతిని ♦ మంచిఁగోరి
యాంధ్రమున వ్రాసి నీకు స ♦ మర్పితంబు
గానొనర్చితిసత్యశా ♦ ఖామృగేంద్ర॥

క॥ బృందారకాంగ నాకర
మందారప్రసవ వృష్టి ♦ మానితలోకా
నందకరవిక్రమక్రమ
మందీకృత విద్విషత్ప్ర ♦ మాధైర్యబలా ?

ద్రుతవిలంబితము.

అసురలోక మహోజయదర్పితా
ప్రసృమరప్రభుభావ విభావితా
రసకవిత్వ పరస్వమనఃక్రమా
లసదభంగురలబ్ధ పరాక్రమా ? ॥

గద్య

ఇది శ్రీమదుమామహేశ్వర చరణనళిన నిత్యసేవాసమాసాదితా
నవద్య కవితా యోగహృద్య మహితాత్రేయ గోత్రపవిత్ర
హనుమత్సుధీతనయ విదితనయ లక్ష్మ్యంబా
గర్భశుక్తి ముక్తాఫలాయమాన వేంకట కవీం
ద్రాత్మజత్వానూన హనుమాంబాశమీ
గర్భ హావిర్భు జాయ మాన
రాఘవనారాయణా భిధాన
ప్రణీతంబైన
శ్రీసత్యనారాయణ వ్రతమాహాత్మ్యమునందుఁ
తృతీయాశ్వాసము.
సంపూర్ణము.

రామకృష్ణా ప్రింటింగ్ వర్క్సు, తెనాలి.